# పుప్పి పళ్లను కనుగొన్నాడు మా బాబు ఒకనాడు!






















## ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్

రుచికరమైన మరియు నురుగునిచ్చే టూత్‌పేస్టు
మీ పళ్లను మరియు చిగుళ్లను రెండిటినీ రక్షిస్తుంది.

**Forhan's**
FOR THE GUMS
with active FLUORIDE to check tooth decay

331 F 183 TEL

మీ చిన్నారి పాప నూనూగు బుగ్గలపైన మీరిచ్చే ముద్దులా సున్నితంగా




జాన్సన్స్ బేబీ సోప్
శుద్ధమై...సౌమ్యమై...భద్రమైనది.

Johnson & Johnson

NAME
CLASS DIV.
SUBJECT
SCHOOL

PARLE Melody Chocolate Toffs



NAME
CLASS DIV.
SUBJECT
SCHOOL

PARLE POPPINS




NAME
CLASS DIV.
SUBJECT
SCHOOL

PARLE Gluco



NAME
CLASS DIV.
SUBJECT
SCHOOL

PARLE Gluco



NAME
CLASS DIV.
SUBJECT
SCHOOL

PARLE POPPINS




NAME
CLASS DIV.
SUBJECT
SCHOOL

PARLE Melody Chocolate Toffs






జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ వాడదగ్గది

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.

# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [''పలుకుబడి'']కి ఆధారం, జొన్నలగడ్డ రామలక్ష్మి రచన. కొందరు వ్యక్తులు స్వభావసిద్ధంగా బద్ధకస్తులూ, మితభాషులూగా వుంటారు. మరి కొందరు పలకరిస్తేచాలు ఛలోక్తులు ప్రారంభిస్తారు. అంతమాత్రాన మొదటి తరహా వ్యక్తుల్లోవివేకం, లోకజ్ఞానంశూన్యం అనుకోకూడదు. ఇందుకు ఉదాహరణ, ''సలహాలశివుడు" అన్నకథ.

## అమరవాణి

అభ్యాసేన న లభ్యంతే, చత్వారః సహజా గుణాః,
దాతృత్వం ప్రియవక్తృత్వం, కవిత్వ ముచితజ్ఞతా.

[దానగుణం, మర్యాదగా మాట్లాడడం, కవిత్వం, ఉచితానుచితాలు గ్రహించగలగడం—ఈ నాలుగూ కేవలం అభ్యాసం ద్వారా అలవడేవికావు; స్వభావసిద్ధంగా రావలసినవే.]


సంపుటి 77 సెప్టెంబర్ '85 సంచిక 3

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00




# చందమామ కబుర్లు



## విద్యార్థుల పర్వతారోహణ

బొంబాయిలోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ విద్యాసంస్థకు చెందిన ఆరుగురు విద్యార్థులు జట్టుగా కలిసి ఇటీవల కిన్నార్ హిమాలయాల లోని 6,349 మీటర్ల ఎత్తయిన ఫవరంగ్ శిఖరాన్ని విజయవంతంగా అధిరోహించారు.

## బాలల చిత్ర సంస్థ



బెంగళూరు సమీపంలో, ఏడెనిమిది కోట్ల రూపాయల వ్యయంతో ఆసియా ఖండంలో కెల్లా అతి పెద్దదైన చిల్డ్రెన్స్ ఫిల్మ్ కాంప్లెక్స్ ఒకటి రూపొందించబడనున్నది. ఈ విషయం గురించి చెబుతూ, చిల్డ్రెన్స్ ఫిల్మ్ సొసైటీ ఆఫ్ ఇండియా అధ్యక్షుడు అమోల్ పాలేకర్, "ఇక్కడ బాలల కోసం చిత్రాలు నిర్మించడంతోపాటు, బాలల చేత కూడా చిత్రాలు తీయబడనున్నాయి," అన్నారు.



## అతి పురాతనమైన రాక్షసబల్లులు

అరిజోనా ఎడారిలో 225 మిలియన్ సంవత్సరాల కిందటి డినోజార్ అనే రాక్షసబల్లి అస్థిపంజరం ఒకటి ఇటీవల బయల్పడింది. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన రాబ్ లాంగ్ అనే నిపుణుడు, అదే అతి పురాతనమైన రాక్షసబల్లి అస్థిపంజరమై ఉంటుందని అభిప్రాయపడుతున్నారు.

## మీకు తెలుసా?

1. మన దేశంలో ప్రప్రథమంగా ప్రచురింపబడిన వార్తాపత్రిక ఏదో మీకు తెలుసా?
2. అమెరికాలో రబ్బరు తయారీకి కేంద్రంగా ఉంటున్న స్థలం ఏది?
3. శ్రీలంకలో ముస్లింలూ, హిందువులూ, బౌద్ధులూ పవిత్రంగా భావించే పర్వతం ఏదో మీకు తెలుసా?
4. బుద్ధుడు పుట్టింది లుంబినీవనంలో, మరి నిర్వాణం చెందిందిఎక్కడో మీకుతెలుసా?
5. యోగశాస్త్రం గురించి క్రీ॥ పూ॥ రెండవ శతాబ్దంలోనే సూత్రాలు రచించిన వారెవరో మీకు తెలుసా?

(సమాధానాలు 65 వ పేజీలో)

# అంధకాసురుడు

అంధకుడు అంటే గుడ్డివాడని అర్థం; కాని అంధకాసురుడు మాత్రం గుడ్డివాడు కాడు. పైగా కోరిన వెంటనే వేయి కళ్ళూ, రెండు వేల చేతులూ పుట్టుకొచ్చేట్లు బ్రహ్మచేత వరం పొందినవాడు. అహంకారం చేత కన్నుగానకుండా ప్రవర్తించడం వల్ల వాడికి అంధకుడనే పేరు వచ్చింది!

మితిమించిన గర్వంతో అంధకుడు సాధుజనులనూ, ఋషులనూ, దేవతలనూ హింసించసాగాడు. వాటి బాధల నుంచి బయటపడటం ఎలాగో తెలియక ఋషులూ, దేవతలూ నారదుని దగ్గరకు పోయి, అతని సహాయం వేడారు. నారదుడు ఒక పథకం ఆలోచించాడు :

మందారపర్వతం మీద అపురూప పరిమళాలు వెదజల్లే మందారపుష్పాలు ఉన్నాయి. నారదుడు ఆ మందార పూలదండను మెడలో ధరించి అంధకుడి భవనం కేసి నడిచాడు.

ఆ పువ్వుల అద్భుతమైన వాసనకు ముగ్ధుడైన అంధకుడు, "ఈ పువ్వులు ఎక్కడ లభిస్తాయి?" అని నారదుని అడిగాడు.

"మందారగిరి మీద ఉన్నాయి," అన్నాడు నారదుడు చిన్నగా నవ్వుతూ.

అంధకుడు అప్పటికప్పుడే మందారపర్వతం కేసి బయలుదేరాడు. మందారపర్వత ప్రాంతం శివుడికి చెందినది. శివభక్తులూ, విష్ణుభక్తులూ తప్ప మరెవ్వరూ దాని మీద కాలు మోపడానికి వీలుకాదు.

అంధకుడు అమితమైన గర్వం కలవాడు గనుక, అవన్నీ పట్టించుకోకుండా పర్వతాన్ని అధిరోహించ సాగాడు. ఆ దృశ్యం చూసిన శివుడు ఆగ్రహం చెంది శూలాన్ని ప్రయోగించాడు. మరుక్షణమే అంధకాసురుడు దిక్కులు పెక్కటిల్లేలా అరుస్తూ, కొండ మీది నుంచి అడుగున ఉన్న లోయలో పడి చచ్చాడు!






## 11

[గండభేరుండపక్షి రెక్కలలో దాగి వున్న చంద్రవర్మ, పట్టు తప్పి సరస్సులో పడిపోయాడు. తరవాత అక్కడ మొసళ్ళ బారినుంచి తప్పుకుని, సరస్సు ఒడ్డునే వున్న తోటలోకి చేరాడు. ఒక రాత్రివేళ, మాంత్రికుడైన శంఖుడు వున్న కొండ ఎక్కబోతున్న చంద్రవర్మకు, కొండ దిగువ వున్న బండరాళ్ళ గుట్టల్లో మాంత్రికురాలైన కాపాలిని కనిపించింది. తరవాత—]

రెండు కొండరాళ్ల నడుమ మూలుగుతూ, పడివున్న కాపాలినిని చూసి. చంద్రవర్మ నివ్వెరపోయాడు. అగ్నిపక్షి, గండభేరుండ పక్షులతో మాట్లాడిన సంగతి అతడికి గుర్తు కొచ్చింది. కాపాలిని గండభేరుండ పక్షులకు చిక్క, వాటివల్ల ఈ శంఖుడి కొండ ప్రాంతానికి తేబడిందని అతడు గ్రహించాడు.

"కాపాలినీ, నీకు ప్రాణాపాయం కలిగించే దెబ్బలేమీ తగులలేదు కదా? ఆ గండభేరుండ పక్షు లెక్కడ?" అని అడిగాడు చంద్రవర్మ ఆదుర్దాగా.

కాపాలిని చిన్న గొంతుతో, "వర్మా! అంత పెద్దగా మాట్లాడకు. మనం యీ దాపుల వున్న ఏదైనా గుహ చేరటం మంచిది. అక్కడ అన్ని విషయాలూ చెపుతాను. నాకు ప్రాణాపాయమేమీ లేదు. కొంచెం చేయి సాయం యిస్తే లేచి నడవగలను," అన్నది.




చంద్రవర్మ, కాపాలిని పక్కన వంగి కుడిచేతితో ఆమె భుజం పట్టుకుని, ఆమె లేచి నిలబడేందుకు సాయపడ్డాడు. తరవాత కాపాలిని చంద్రవర్మ చేతిని ఆసరాగా పట్టుకుని నడుస్తూ, "వర్మా! ఆ వెదురు పొదల చాటున ఏదో గుహలా కనిపిస్తున్నది. అక్కడికి వెళదాం పద," అన్నది.

చంద్రవర్మా, కాపాలినీ చిన్న చిన్న రాళ్ళను ఎక్కి దిగుతూ కొద్దిసేపటికల్లా, కొండపాదంలో వున్న ఒక చీకటి గుహను చేరారు. ఆ గుహద్వారం చాలా యిరుకైనది. దానిని అన్నివైపులా కప్పుతూ వెదురు పొదలూ, అడవి మొక్కలూ, ఏవేవో తీగలూ దట్టంగా పెరిగి వున్నవి. గుహ లోపలమాత్రం విశాలంగా వున్నది. గుహ పైభాగంలో వున్న రాతి పగుళ్ళ నుంచి సన్నని గుడ్డివెలుగు అక్కడా యిక్కడా ప్రసరిస్తున్నది.

కాపాలిని గుహకు ఒక మూలగా చేరగిలబడి కూర్చోగానే, చంద్రవర్మ ఆమెను, "కాపాలినీ! నువ్వు యీ కొండ ప్రాంతాలకు తేబడినట్టు మాంత్రికుడైన శంఖుడికి తెలుసా?" అని అడిగాడు.

కాపాలిని చిరునవ్వు నవ్వింది. ఆమెలో ప్రాణభీతి ఏ కోశానా వున్నట్టు లేదు.

"వర్మా! నేను యీ కొండప్రాంతాన వున్నట్టు తెలిస్తే, శంఖుడు నన్నీసరికే హతమార్చి వుండేవాడు. నేను నిన్న తెల్లవారుజాము నుంచి, యీ రాళ్ళగుట్టల మధ్య పడివున్నాను. హఠాత్తుగా మీద పడి నన్ను పట్టుకున్న గండభేరుండ పక్షులు రెండూ, కాలనాగుకు చిక్కి దుర్మరణం పాలయినై," అన్నది కాపాలిని.

"అలా అయితే యిక మనం భయపడ వలసిన పని లేదు. నేను యీ చీకటి మాటున శంఖుడి మంత్రగృహం సంగతేమిటో తేల్చుకుంటాను," అంటూ చంద్రవర్మ లేచాడు.

కాపాలిని చంద్రవర్మను వారిస్తూ, "వర్మా, ఆ అగ్నిపక్షి సంగతి మరిచిపోకు.




రాత్రివేళ మనం భయపడవలసింది ఆ అగ్నిపక్షిని గురించి; పగటివేళ శంఖుడి నుంచి ప్రమాదం శంకించవచ్చు. ఈ రాత్రితో అగ్నిపక్షి బెడద వదిలితే తప్ప. మనకు క్షేమం లేదు. దాని అంతు తెలుసుకునేందుకు కాలనాగు ప్రయత్నిస్తున్నది," అన్నది.

"కాలనాగు యిక్కడికి వచ్చిందా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యంగా.

చంద్రవర్మ మాటలకు కాపాలిని నవ్వింది. "వర్మా! కాలనాగుకు నా మీద కన్న నీ మీద భక్తి విశ్వాసాలు ఎక్కువని తెలుసుకున్నాను. హఠాత్తుగా నువ్విక్కడ కనిపించినప్పుడు నేనేమీ ఆశ్చర్యపడ లేదు. ఇంత త్వరలో యిక్కడికి ఎలా చేరావని కూడా నిన్నడగలేదు. దానికి కారణం: కాలనాగు నీ గురించి సర్వం నాకు చెప్పింది. అడవిలోని వింత వృక్షాన్నుంచి పండు కోసుకు తిన్నావని తెలుసుకున్నప్పుడే, నీవు క్షేమంగా యిక్కడికి చేరగలవని నేను భావించాను," అన్నది కాపాలిని.

కాపాలిని మాట ముగించీ ముగించక ముందే, పెద్దగా మెరిసినట్టయి ఆ ప్రాంతమంతా వెలుగుతో నిండిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ గుహ ద్వారం దగ్గిరకు వచ్చి బయటికి తొంగి చూశాడు. సమీపంలో వున్న వెదురుపొదల వెనక భాగంలో అగ్నిపక్షి కనిపించింది. ఆ వెంటనే కోరలు సాచిన కాలనాగు దాని మీదికి లంఘించటం అతడి కంటబడింది.

"కాపాలినీ! అగ్నిపక్షి మీద కాలనాగు కలియబడుతున్నది. నేను వెళ్ళి కాలనాగుకు సహాయం చేస్తాను," అన్నాడు చంద్రవర్మ.

"వద్దు వర్మా, వద్దు!" అంటూ కాపాలిని వున్న చోటు నుంచి గుహ ముఖద్వారం దగ్గిరకు వచ్చి బయటికి చూస్తూ, "ఆ శంఖుడి భృత్యుణ్ణి కాలనాగు హతమార్చగలదని నాకు విశ్వాసం వున్నది. అలా కానినాడు నీకూ, నాకూ కూడా



అగ్నిపక్షి కంఠాన్ని కాటు వేసేందుకు కాలనాగు ప్రయత్నిస్తున్నది. అగ్నిపక్షి శరీరం నుంచి వెలువడే మంటలు కాలనాగు శరీరానికి ఉడుకులెత్తిస్తున్నవి. కాలనాగు నోటి నుంచి విడిచే విషవాయువుల తాకిడికి అగ్నిపక్షి కళ్ళు తేలవేసి అటూ యిటూ పడిలేస్తూ, తిరిగి పోరాటానికి తలపడుతున్నది.

''ఈ అలజడి శంఖుడి చెవులబడితే, మనం అతడి చేతిలో చిక్కిపోయినట్టే,'' అన్నాడు చంద్రవర్మ.

''అలా జరిగే అవకాశం లేదు. తన భృత్యుడైన అగ్నిపక్షి రాత్రివేళ కాపలా కాస్తూండగా, తన కెలాంటి ప్రమాదమూ వాటిల్లదని శంఖుడి నమ్మకం. ఆ కారణం వల్ల అతడు చీకటి పడగానే నిద్రకు ఉపక్రమిస్తాడు. తిరిగి సూర్యోదయానికి కొంచెం ముందుగా మాత్రమే అతడు నిద్ర నుంచి మేల్కొనటం జరుగుతుంది. అతడి అలవాట్లన్నీ నాకు తెలియనివి కావు,'' అన్నది కాపాలిని.

ఇంతలో అగ్నిపక్షి పెద్దగా అరవబోయి కీచుమంటూ శబ్దం చేసి తల వేలాడ వేసింది. తన మూడు తలలతో కాలనాగు దాని గొంతు బిగించి, అది తల వేలాడ వేయగానే, తన పట్టు వదిలి పక్కకు వాలింది.

అతణ్ణుంచి ప్రమాదం తప్పదు. గండభేరుండ పక్షులు నన్ను యీ కొండ ప్రాంతాలకు తెచ్చినవని అగ్నిపక్షి పసికట్టి వుంటుంది. ఆ సంగతి అది తన యజమానితో చెప్పకముందే దాన్ని తుద ముట్టించటం క్షేమం,'' అన్నది.

ఈలోపల అగ్నిపక్షి, కాలనాగూ ఒకళ్ళ నొకళ్ళు హతమార్చుకునేందుకు చేసే పోరాటం మహా భయంకరంగా వున్నది. అగ్నిపక్షి తన వాడి ముక్కుతో కాలనాగు మూడు తలలను చిన్నాభిన్నం చేసేందుకు ప్రయత్నిస్తున్నది. అగ్నిపక్షి వాడి గోళ్ళ నుంచి చర్రున జారుతూ, దాని పట్టు నుంచి బయటపడగానే, తన కోరలతో

''జై, కాలనాగూ....వీరనాగూ!'' అంటూ చప్పట్లు చరచబోయి, అంతలోనే నాలుక కొరుక్కుని, అమితోత్సాహంగా చంద్రవర్మ గుహ నుంచి బయటికి దూకాడు. కాపాలిని కూడా ఎక్కడలేని ఓపికా తెచ్చుకుని, చంద్రవర్మతోపాటు బయటికి నడిచింది.

చంద్రవర్మా, కాపాలినీ తనను సమీపించేసరికి కాలనాగు సొమ్మసిల్లి నేలను కరుచుకు పడుకుని వున్నది. ఆ యిద్దరూ దగ్గిరకు రావటం చూస్తూనే అది చప్పున తన తలలను పైకెత్తి గౌరవసూచకంగా ఆడించింది.

చంద్రవర్మ, కాలనాగును సమీపించి అప్యాయంగా దాని శరీరాన్ని నిమిరాడు. అగ్నిపక్షి రెక్కల నుంచి వెలువడే మంటలకు కాలనాగు శరీరం నల్లగా కాలి, కొన్ని చోట్ల చర్మం వూడిపోయింది. తన సేవకుడి దుస్థితి చూస్తూనే కాపాలిని నివ్వెరపోయి, ప్రేమగా దాని తలలను తాకుతూ, ''కాలనాగూ! ఈనాటితో నీ బాధలు తీరిపోయినై. శంఖుడి మంత్రగృహం నుంచి అపూర్వ శక్తులు గల శంఖాన్ని చేజిక్కించుకోగానే, నీకు మానవరూపం ప్రసాదిస్తాను. ఆ తరవాత నీ యిష్టం వచ్చిన చోటుకు వెళ్ళవచ్చు.'' అన్నది.

శంఖుడి మంత్రగృహం పేరు వింటూనే చంద్రవర్మ అదిరిపడ్డాడు. అతడు దృష్టిని తూర్పుదిక్కు కేసి సారించి, ''కాపాలినీ, సూర్యోదయానికి అట్టే వేళ లేనట్టున్నది.






యిక నేను ఆ మాంత్రికుడి పూజా మందిరం సంగతేమిటో చూస్తాను,'' అన్నాడు.

కాపాలిని కూడా తూర్పుదిక్కు కేసి చూసి, ''వర్మా! నీవు యీ వేళలో అతడి మంత్రగృహానికి వెళ్ళటం క్షేమం కాదు. అతణ్ణి తుదముట్టించటానికి నేనొక ఉపాయం ఆలోచించాను,'' అన్నది.

''ఏమిటది?'' అన్నాడు చంద్రవర్మ.

''శంఖుడు ప్రతి రోజూ సూర్యోదయం వేళ, తూర్పుదిక్కున వున్న కొండ అంచు మీదికి వెళ్ళి, అక్కడ వున్న ఒక రాయి మీద నిలబడి గిర్రున అన్ని దిక్కులకూ తిరుగుతూ మంత్రోచ్చారణ చేస్తాడు. ఆ రాయి అడుగు వెడల్పు, అడుగు ఎత్తు మాత్రం వుంటుంది. ఆ రాతికి దిగువున దాదాపు వెయ్యి అడుగుల లోతు గల పెద్ద అగాధం వున్నది. నేను చెప్పినట్టు చేయగలిగితే, శంఖుణ్ణి ఆ రాతి మీది నుంచి, కింద వున్న అగాధంలోకి తోసి, అతడి శరీరం అక్కడ వున్న కరకురాళ్ళ మీద పడి ముక్కలూ చెక్కలూ అయేట్టు చేయవచ్చు,'' అన్నది కాపాలిని.

''ఏమిటా ఉపాయం కాపాలినీ?'' అని అడిగాడు చంద్రవర్మ ఉత్సాహంగా.

''అదేమిటో చెపుతాను, దగ్గిరకు రా!'' అంటూ కాపాలిని, చంద్రవర్మ దగ్గిరకు రాగానే అతడి చెవిలో రహస్యం ఏదో చెప్పి, ''ఇది ఎంతో గోప్యంగా నెరవేర్చవలసిన కార్యం. ఏమాత్రం పొరబాటు జరిగినా, సర్వనాశనం తప్పదు,'' అన్నది.

చంద్రవర్మ ఓ తృటికాలం ఆలోచిస్తూ నిలబడి, తరవాత దాపుల వున్న ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి తూర్పుదిక్కు కేసి కొంచెంసేపు పరీక్షించి చూసి దిగివచ్చి, కాపాలినితో, ''కాపాలినీ! సూర్యోదయానికి మరెంతో కాలం లేదు. నా పని మీద నేనుంటాను. నువ్వూ, కాలనాగూ ఆ గుహలో విశ్రాంతి తీసుకోండి,'' అంటూ చరచర బరలో నుంచి కత్తి దూసి, చెట్ల గుంపుల్లోకి వెళ్ళాడు.

చూస్తూండగానే చంద్రవర్మ కత్తి వేటులకు చెట్ల ఊడలు ఒకదానివెంట ఒకటి తెగి, గుట్టలు గుట్టలుగా కింద పడసాగినై. ఆ ఊడ లన్నిటినీ ఒకచోట చేర్చి, వాటిని ఒకదాని కొకటి ముడివేసి కొద్దిసేపటిలోనే చాలా పొడవైన మోకులా తయారు చేశాడు చంద్రవర్మ. అలా తయారైన మోకు కొసను భుజాన వేసుకుని చకచకా కొండ ఎక్కి, దాని తూర్పువైపు అంచున వున్న అడుగు చదరం గల రాతికి దానిని ముడివేశాడు. మాంత్రికుడైన శంఖుడు ప్రతి రోజూ సూర్యోదయానికి కొంచెం ముందుగా ఆ రాతి మీదనే నిలబడి, అన్ని దిక్కులకూ తిరుగుతూ మంత్రోచ్చారణ చేస్తాడు.



తన పని ముగియగానే చంద్రవర్మ కొండ దిగి కాపాలిని వున్న గుహ దగ్గిరకు వచ్చాడు. అతణ్ణి గుహముందు చూస్తూనే కాపాలిని బయటికి వచ్చి, "వర్మా! పని విజయవంతంగా నెరవేర్చావా?" అని అడిగింది.

"అప్పుడే విజయం సంగతి ఎలా చెప్ప గలను? ఊడ ఒక చివరి కొసను ఆ రాతికి బిగించాను. రెండవ కొస కొండ దిగువ వున్నది. కాని, నన్నొక సందేహం బాధిస్తున్నది. మనం ఆ రాతిని తూర్పు దిక్కుకు గుంజినప్పుడు గదా, అది శంఖుణ్ణి అగాధంలోకి యీడ్చి ముక్కలు ముక్కలు చేసేది?" అని అడిగాడు.

"అదా నీ అనుమానం!" అంటూ కాపాలిని చిరునవ్వు నవ్వి, "సరే, శంఖుడు ఆ రాతి మీదకు ఎక్కగానే నువ్వు గుంజవలసిన ఊడ కొస ఎక్కడున్నదో నాకు చూపించు. నీ అనుమానా లన్నీ నివారణ చేస్తాను," అన్నది.

చంద్రవర్మ, కాపాలిని వెంట రాగా కొండ పార్శ్వానికి వెళ్ళి, అక్కడ వున్న ఊడ కొసను ఆమెకు చూపించాడు. కాపాలిని దానిని తాకి, తరవాత తూర్పు వైపున వున్న కొండ అంచుకేసి చూస్తూ, "వర్మా! శంఖుడు మంత్రోచ్చారణ

చేసేందుకు ఎక్కి నిలబడే ఆ రాతిని ఏమాత్రం పక్కకు కదిలించినా అది కొండ అంచు మీద వున్నది గనక, తప్పని సరిగా ఆ దిగువ గల అగాధంలోకే పడి పోతుంది. ఆ విషయంలో ఎలాంటి అనుమానానికీ ఆస్కారం లేదు,'' అంటూ హఠాత్తుగా కళ్ళు పెద్దవి చేసి, చంద్రవర్మ కేసి తల వంచి, ''అడుగో, శంఖుడు! చేతిలో తళతళ మెరిసే మంత్రదండం కనబడుతున్నదా? అతడు రాయి మీదికి ఎక్కి నిలబడీ నిలబడటంతోనే, నువ్వు ఊడను లాగాలి,'' అన్నది కంఠస్వరం తగ్గించి.

చంద్రవర్మ కొండ పైకి చూశాడు. అప్పుడే తెలతెల్లనవుతున్న తూర్పుదిక్కు లేత వెలుగులో మాంత్రికుడైన శంఖుడి వికృతాకారం అతడికి కనిపించింది. ఒక్క క్షణకాలం చంద్రవర్మ నిలువెల్లా వణికి పోయి, అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, ఊడ కొసను రెండు చేతులతోటీ గట్టిగా పట్టుకున్నాడు. అంతలో శంఖుడు కొండ అంచున వున్న రాతిని సమీపించి దాని మీదికి ఎక్కి నిలబడి, మంత్రదండాన్ని ఉదయిస్తున్న సూర్యుడి కేసి ఎత్తాడు.

''వర్మా, యిదే మంచి సమయం. ఊడను ఒక్కసారి గుంజి, చప్పున వదిలి పెట్టు,'' అన్నది కాపాలిని ఆత్రుతగా.

చంద్రవర్మ తన చేతులలో వున్న ఊడను బలంగా ఒకసారి గుంజి తక్కున వదిలేశాడు. ఆ తక్షణం శంఖుడు చేతులు రెంటినీ పైకెత్తి వూపుతూ, కాళ్ళతో గాలిని మథిస్తూ, ''మోసం! ద్రోహం!'' అంటూ భీకరంగా అరిచాడు. అతడి చేతిలో వున్న మంత్రదండం మెరుపులా పోయి, మంత్ర గృహాన్ని తాకింది. మంత్రగృహం వున్నదున్నట్టు పునాదులతో కూడా గాలిలోకి లేచి, పెద్ద ధ్వని చేస్తూ సరస్సు మధ్యన పడిపోయింది.

ఈలోపల శంఖుడు కొండదిగువ నున్న అగాధంలోని బండరాళ్ళ మీద తలకిందులుగా పడిపోయాడు. —(ఇంకావుంది)



# పలుకుబడి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అర్ధరాత్రి వేళ యీ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తుంటే, నీది పరోపకార స్వభావం అనిపించుతున్నది. ఇది నా అపోహ, భ్రమా కావచ్చు! ఎందువల్లనంటే, మనిషి స్వభావం విచిత్రమైనదే కాక, చాలా జటిలమైనది. ఎవరూ ఇతరులను పూర్తిగా అర్థం చేసుకోలేకపోవడమే కాక, తమను తామే అర్థం చేసుకోలేరు. అయితే, వాళ్ళు ఒకరినొకరు అర్థం చేసుకున్నామన్న భ్రమ కారణంగా, యీ జగన్నాటకం సాగిపోతున్నది. ఇందుకు ఉదాహరణగా శ్రీపాలుడనే వాడి కథ చెబుతాను. శ్రమ

## బేతాళ కథలు



తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

శీతలు డనే వాడు స్వగ్రామంలో వ్యవసాయం చేసుకుని జీవిస్తున్నాడు. వాడికి పట్టుదల ఎక్కువని అంతా చెప్పుకుంటారు. రాజధానీ నగరంలో ఒకచోట కొత్తగా భవనం కట్టడానికి పునాదులు తీస్తూండగా, భూమిలోంచి ఒక సింహాసనం బయటపడ్డ విశేషం వాడికి తెలిసింది. దానిపై కూర్చున్నవారికి, తాత్కాలికంగా మంత్రశక్తులు వస్తున్నాయట!

ఆ సింహాసనం కొన్ని వందల ఏళ్ళ క్రితం ప్రపంచాన్ని గడగడలాడించిన, శక్తిరూపు డనే మాంత్రికుడిది. తవ్వకాల్లో బయటపడగానే మహారాజు దాన్ని కోటలో ఒక ప్రత్యేక భవనానికి తరలించాడు. ఆ సింహాసనం చూడాలని ఎందరెందరో రాజధానికి వెళుతున్నారు.

శీతలుడి క్కూడా రాజధానికి వెళ్ళి, ఆ మాంత్రికుడి సింహాసనం చూడాలనిపించింది. ఎందువల్లనంటే, దాన్ని గురించి ఎన్నో కథలు ప్రచారంలోకి వస్తున్నవి. తదేక దీక్షతో ఆ సింహాసనం వైపు చూస్తే, దానిమీద కూర్చున్న శక్తిరూపుడి ఆకారం ఛాయామాత్రంగా కనిపిస్తుందట. మామూలుగా ఆ సింహాసనం మీద ఎవరూ కూర్చోలేరుట. సింహాసనానికి ముమ్మారు ప్రదక్షిణం చేసి, ''శక్తిరూపా! నేను, నీ భృత్యుణ్ణి. నీ గొప్పతనం తెలుసుకునేందుకే తప్ప, నీ స్థానం ఆక్రమించడానికి సింహాసనం ఎక్కడం లేదు,'' అని మనసులో అనుకున్నవారే, ఆ సింహాసనంలో కూర్చోగలుగుతున్నారుట.

శ్రీపాలు డనేవాడు శీతలుడి దగ్గిర బంధువు. అతను రాజు కొలువులో వుంటున్నాడు. ప్రతిరోజూ ఉదయమూ, సాయంత్రమూ అతను రాజుకు పురాణం చదివి వినిపిస్తాడు.

మాంత్రికుడి సింహాసనం చూడాలన్న కోరికతో శీతలుడు రాజధాని చేరి, శ్రీపాలుడి ఇంటికి వెళ్ళాడు. శ్రీపాలుడు

వాణ్ణి సాదరంగానూ, సాభిమానంగానూ అహ్వానించాడు. శీతలుడు అతడికి తను వచ్చిన పని చెప్పాడు.

"నువ్వు వచ్చినది ఇందుకే అయితే చాలా పొరబాటు చేశావు. ఇప్పుడా మాంత్రికుడి సింహాసనాన్ని అందర్నీ చూడనివ్వడం లేదు. గతంలో చూడ వచ్చిన కొందరు శృతి మించి ప్రవర్తించడంవల్ల, ఇప్పుడు ప్రత్యేకంగా రాజానుమతి పొందిన వారినే దాన్ని చూడనిస్తున్నారు," అన్నాడు శ్రీపాలుడు.



"అయితే నువ్వు, నాకు ఆ అనుమతి సంపాయించి పెట్టు," అన్నాడు శీతలుడు సంతోషంగా.

అందుకు శ్రీపాలుడు నవ్వి, "వెర్రివాడా, ఏమనుకున్నావో, అందుకు చాలా పలుకుబడి కావాలి. ఏదో పురాణం చదివి బతికేవాణ్ణి. నాకంత పలుకుబడి లేదు," అన్నాడు.

శీతలుడు అప్పటికేమీ మాట్లాడకుండా వూరుకున్నాడు. మర్నాడు వాడు నగరంలో చాలాచోట్లు తిరిగి, మాంత్రికుడి సింహాసనం చూసే ఉపాయాల గురించి విచారించాడు. వాడు వుంటున్నది శ్రీపాలుడి ఇంట్లోనని తెలిసినవాళ్లందరూ, "నీకు సమస్య ఏముంది? శ్రీపాలుడి మాట రాజుకు వేదవాక్కు. ఆ సింహాసనం చూడడానికి, ఆయనకున్న పలుకుబడి చాలు," అన్నారు.

ఆ రోజు సాయంత్రం రాజుకు పురాణం వినిపించి వచ్చిన శ్రీపాలుడితో, "అంతా నీకు చాలా పలుకుబడి వున్నదంటున్నారు. నాకీ చిన్న సాయం చేయలేవా?" అన్నాడు శీతలుడు.

"అదంతా అందరి భ్రమా తప్పితే, నాకే పలుకుబడీ లేదు. ఈ విషయంలో నన్ను వేధించకు," అన్నాడు శ్రీపాలుడు.

తన పని శ్రీపాలుడి వల్ల కాదని శీతలుడు నిశ్చయించుకున్నాడు. అయితే, వాడు అనుకున్నది సాధించకుండా, వెనక్కు తిరిగి వెళ్ళదలచుకోలేదు.



కోటలో మాంత్రికుడి సింహాసనం వున్న భవనానికి కాపలా కాసే సైనికుల్లో ఒకడితో వాడికి పరిచయమయింది.

ఆ సైనికుడు శీతలుడితో, "రేపు కోటకు వచ్చావంటే, సింహాసనం చూపిస్తాను," అని మాట యిచ్చాడు.

శీతలుడు ఈ విషయం శ్రీపాలుడికి చెప్పకుని, "మొత్తం మీద అనుకున్నది సాధించాను! రేపు నన్ను కోటకు తీసుకు వెళితే చాలు," అన్నాడు.

జరిగినది తెలియగానే శ్రీపాలుడికి మతిపోయినట్టయింది. తనవల్ల కానిపని శీతలుడు సాధించాడంటే, ఈ విషయం గ్రామానికి వెళ్ళాక అందరికీ చెప్పకుంటాడు. అక్కడ అందరూ, తనేదో గొప్ప పదవిలో వున్నాడనుకుంటున్నారు. ఈ సంగతి తెలిస్తే, తనకెంత చిన్నతనం!

ఇలా ఆలోచించి శ్రీపాలుడు మర్నాటి ఉదయం, రాజుకు పురాణం వినిపించే ముందు, "ప్రభూ, తమరు మాంత్రికుడి సింహాసనం విషయంలో చేసిన కట్టు దిట్టాలు సరిపోవనుకుంటాను. కొందరు కాపలా సైనికులు, తమకు తోచిన వారందరికీ సింహాసనం చూసే అవకాశం కల్పిస్తున్నారు," అని చెప్పాడు.

రాజు వెంటనే ఒక పరిచారకుణ్ణి పిలిచి, "మాంత్రికుడి సింహాసనం వుంచిన భవనానికి కాపలా కాసే సైనికు లెవ్వరూ అందులో ప్రవేశించరాదు. ఇందుకు తగిన ఏర్పాటు చెయ్యమన్నా నని, మా మాటగా మంత్రికి చెప్పు," అని ఆజ్ఞాపించాడు.

శ్రీపాలుడు తృప్తిగా ఇంటికి వెళ్ళి పోయాడు. ఆ సాయంత్రం అతడు శీతలుణ్ణి కోటకు తీసుకుపోయాడు. శీతలుడు తనకు పరిచయం అయిన సైనికుడి దగ్గిరకు వెళ్ళగానే వాడు విచారంగా, "నన్ను మన్నించు. ఈ రోజు నుంచీ కాపలా సైనికులు కూడా భవనంలో ప్రవేశించరాదన్న కొత్త నియమం వచ్చింది," అన్నాడు.

శీతలుడెంతో నిరుత్సాహపడి, ''ఇంకే దైనా ఉపాయం లేదా ?'' అని అడిగాడు.

''ఈ విషయంలో మంత్రిగారు తప్ప, నీకెవ్వరూ సాయపడలేరు,'' అన్నాడు కాపలా సైనికుడు.



మర్నాడు ఉదయమే శీతలుడు మంత్రి గారింటికి వెళ్ళి, ఇంట్లోంచి బయటికి వచ్చిన వారందరికీ సాష్టాంగ నమస్కారాలు చేయసాగాడు. ఇది విడ్డూరంగా కనబడి, మంత్రి వాడిని పిలిచి, వాడి ప్రవర్తనకు కారణం ఏమిటని అడిగాడు.

''అయ్యా, మాంత్రికుడి సింహాసనం చూడాలని నేను చాలా దూర గ్రామం నుంచి నగరానికి వచ్చాను. అందుకు తమరు తప్ప, మరెవ్వరూ సాయపడలేరని తెలిసింది. తమను తృప్తిపరచడానికి నా దగ్గిర ఏమున్నది? మీ ఇంట్లోని వారందరి పట్లా, నాకున్న భక్తిభావం ప్రదర్శించడం మినహా, నేను చేయగలిగిందేమీ లేదు,'' అన్నాడు శీతలుడు.

మంత్రికి వాడి మాటలు నచ్చాయి. ఆయన వాణ్ణి ఎక్కడ వుంటున్నదీ అడిగి, వాడు శ్రీపాలుడి ఇంట్లో వుంటున్నాడని తెలియగానే, ''ఇంకేం మరి! శ్రీపాలుడికి కోటలో ఎక్కడా అడ్డులేదు,'' అన్నాడు.

అందుకు శీతలుడు విచారంగా, ''ఆ మాట అందరూ అంటున్నారు కాని, ఆయన ఒప్పుకోవడం లేదు. మీరు, నాకు ప్రత్యేకానుమతి యిచ్చినట్టు, రేపు ఆయనతో మీరే చెప్పండి. నా కోరిక తీరుతుంది,'' అన్నాడు.

మంత్రి సరేనన్నాడు. శీతలుడు ఉత్సాహంగా ఇంటికి వెళ్ళి, జరిగింది శ్రీపాలుడికి చెప్పి, ''నా పట్టుదల గురించి అందరికీ తెలుసు. ఎలాగో అలా అనుకున్నది సాధిస్తాను!'' అన్నాడు.

శీతలుడు కనక మాంత్రికుడి సింహాసనం చూడగలిగితే, తన పరువు పోయినట్టేనని శ్రీపాలుడు భావించాడు. మర్నాడతను మంత్రిని కలిసినప్పుడు, ''మీరు, నా ఇంట చేరిన శీతలుడికి, మాంత్రికుడి



సింహాసనం చూడ్డానికి ప్రత్యేకానుమతి ఇస్తానన్నారుట. చాలా సంతోషం! అయితే, ఇందులో నా బాధ్యత ఏమీ లేదు. అక్కడ ఏమి జరిగినా, ఆ బాధ్యత మీదే!'' అని చెప్పాడు.

ఈ మాటలు విని మంత్రి, శీతలుడు తిన్ననైనవాడు కాదని భయపడ్డాడు. అలా కాకపోతే, శ్రీపాలుడు తనే అన్ని ఏర్పాట్లూ చేసేవాడుకదా!

''అబ్బే! ఇందులో నా బాధ్యత ఎందుకు? మీకు ఇష్టం లేకపోతే, నాకూ ఇష్టం లేదు,'' అనేశాడు మంత్రి.

శ్రీపాలుడు ఇంటికి వెళ్ళి, శీతలుడితో, ''మంత్రి నీతో ఏమన్నాడో, నాకు తెలియదు. మాంత్రికుడి సింహాసనం చూడడానికి అనుమతి లభించలేదు,'' అని చెప్పాడు.

శీతలుడు తెల్లబోయి వెంటనే మంత్రి ఇంటికి వెళ్లాడు. మంత్రి వాడితో, ''నువ్వు, శ్రీపాలుడి బంధువుకాబట్టి, ఆయన ఇష్టం లేనిదే మాంత్రికుడి సింహాసనం చూడలేవు. ఎందువల్లనో నువ్వు దాన్ని చూడడం, ఆయనకు ఇష్టం లేదు,'' అని జరిగినది చెప్పాడు.

శీతలుడు ఇంటికి తిరిగి వెళ్ళి, ''నేను గ్రామానికి తిరిగి వెళ్ళిపోతున్నాను,'' అన్నాడు శ్రీపాలుడితో.

''నిరుత్సాహపడకు. కేవలం పట్టుదలతో అన్నీ సాధించలేము. ఆ మాంత్రికుడి సింహాసనం చూడడం నీకు సాధ్యపడదని, నేను ముందే చెప్పాను,'' అన్నాడు శ్రీపాలుడు.

''నువ్వు తలుచుకుంటే సాధ్యపడేది!'' అన్నాడు శీతలుడు.

''నాకు అంత పలుకుబడి లేని సంగతి కూడా ముందే చెప్పాను,'' అన్నాడు శ్రీపాలుడు.

''నీకు పలుకుబడి లేకుంటే, ఏ బాధా లేకపోయేది. నీ పలుకుబడే, నాకు ఆటంకమైంది!'' అన్నాడు శీతలుడు ఉక్రోషంగా.

ఆ మాటలు వింటూనే శ్రీపాలుడు ఉలిక్కిపడ్డాడు. మరసటి రోజున అతను శీతలుడికి మాంత్రికుడి సింహాసనం చూసే ఏర్పాటు చేయించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శ్రీపాలుడి ప్రవర్తన గురించి, నీ అభిప్రాయం ఏమిటి? ఆ క్షణం వరకూ శీతలుడికి మాంత్రికుడి సింహాసనం చూసేందుకు సాయపడనివాడు, వాడు ఉక్రోషంగా అన్న మాటలు విని, ఎందుకు మారిపోయాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శ్రీపాలుడి వంటి మనస్తత్వం గలవాళ్ళు చాలా అరుదు. అలాంటివాళ్ళు, తమ బతుకు తెరువేదో తాము చూసుకోవాలి తప్ప, యితరుల విషయాల్లో జోక్యం కలిగించుకోకూడదనుకుంటారు. అనుకోవడమే కాక—అలా ప్రవర్తిస్తున్నామన్న నమ్మకం కూడా వాళ్ళకుంటుంది. శీతలుడు మాంత్రికుడి సింహాసనం చూసేందుకు శ్రీపాలుడి సాయమడిగినప్పుడు, అది ఇతరుల వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవడం అవుతుందని, అందుకు నిరాకరించాడు. అంటే—తనకున్న పలుకుబడిలో అతడికి నమ్మకం లేదు. కాని, శీతలుడు కోపం కొద్దీ అన్న మాటలు వినగానే, అతడికి తన పలుకుబడిని యితరులకు సాయం జేయడానికి కాక, వాళ్ళకు నష్టం కలిగించడానికి ఉపయోగిస్తున్నట్టు అర్థమైపోయింది. రాజు దగ్గిరా, మంత్రి దగ్గిరా తనకున్న పలుకుబడిని ఉపయోగించే అతడు, శీతలుడి కోరిక నెరవేరకుండా అడ్డుకున్నాడు. శీతలుడి పట్టుదల శ్రీపాలుడికి తన నిజరూపాన్ని కళ్ళకు కట్టినట్టు చూపింది. ఆ కారణం వల్లనే, అతడు మనసు మార్చుకుని శీతలుడికి సాయపడ్డాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# చిత్తశుద్ధి

విశాఖదత్తుడనే రాజు కొన్నాళ్ళు అనారోగ్యంతో బాధపడి కోలుకోసాగాడు. ఒకనాటి సాయంకాలం నగర ప్రముఖులు కొందరు రాజుగారిని పరామర్శించడానికి వచ్చి, వాళ్ళు రాజుగారి ఆరోగ్యం కుదుటపడాలని దేవాలయాలలో జరిపిన పూజాప్రసాదాలను ఆయనకు అందజేశారు.

ఆ సమయంలో రాజభటులు అడ్డుపడి వారిస్తున్నా వినకుండా, ఒక పశువుల కాపరి రాజు దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చి, భుజాన వేలాడుతున్న మూటను తీసి రాజుగారికి అందిస్తూ, "ప్రభూ, నన్ను గోపన్న అంటారు. ఇక్కడికి ఆమడదూరంలో ఉన్న మైదానంలో తమ గోవులను కాస్తూ ఉంటాను. తమకు ఒళ్ళు సుస్తీ చేసిందని తెలిసి, మా ఊరి పోలేరమ్మ గుడిలో పొంగలి నైవేద్యం పెట్టి తీసుకువచ్చాను. ఆ తల్లి ప్రసాదం తింటే, ఎలాంటి జబ్బయినా ఇట్టే నయమై పోతుంది," అన్నాడు.

రాజు ఆ మూటను విప్పగానే, అందులో నుంచి వచ్చిన వాసనకు, అక్కడ ఉన్న ప్రముఖులందరూ ముక్కులు మూసుకున్నారు. రాజు మాత్రం, చిరునవ్వుతో తన కంఠహారాన్ని తీసి గోపన్న మెడలో వేశాడు!

పక్కనే ఉండి ఇదంతా చూస్తూన్న రాజుగారి బాల్యమిత్రుడు, "మహారాజా, కంపు కొడుతున్న ఆ ప్రసాదాన్ని తెచ్చిన ఆ పశువులకాపరిని అంత ఘనంగా సత్కరించారేమిటి?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"అది కంపుకొడుతున్నా, దానిని తింటే నా ఆరోగ్యం కుదుటపడగలదన్న ఆశతో, ఇంత దూరం నడిచి వచ్చిన అతని చిత్తశుద్ధి, ప్రతిఫలాపేక్షలేని ఆప్యాయత అనుపమానమైనవి!" అన్నాడు విశాఖదత్తుడు.

—కమలిని.





# మాళవిక

మందాకినీ నదీతీరంలో, మరకతపురం అనే గ్రామం వుండేది. ఆ గ్రామంలో నివసించే మాళవిక అనే యువతి మంచి నర్తకి. ప్రతి సంవత్సరం, ఆ గ్రామంలోని మందాకినీదేవి ఆలయంలో జరిగే పండుగ ఉత్సవాల్లో, మాళవిక నృత్యం చేసేది. ఆమె నాట్య ప్రదర్శనతో ఉత్సవాలు ముగుస్తూండేవి.

ఒక సంవత్సరం అనారోగ్యం కారణంగా మాళవిక నృత్యం జరగలేదు. ఉత్సవాలన్నీ ఆమె నాట్యం లేకుండానే పేలవంగా జరిగిపోయాయి. ఆమె నాట్యం లేని కారణంగా, అందరూ అసంతృప్తి చెందారు.

ఉత్సవాలు ముగిసిన మర్నాటి నుంచీ, గ్రామప్రజలు మాళవికను చూడబోయి, ఆమె నాట్యం లేనందువల్ల, ఉత్సవాలు తమకు తృప్తి కలిగించలేదని చెప్పసాగారు. ఈసారి రానున్న ఉత్సవాలకు, ఆమె పూర్తిగా ఆరోగ్యవంతురాలై, నాట్య ప్రదర్శన యివ్వాలని కోరారు.

తన నాట్యం లేనందుకు ప్రజలు బాధపడుతూ అంటున్న మాటలు వింటున్న కొద్దీ, మాళవిక మనసు గర్వంతో నిండిపోసాగింది.

చూస్తూండగానే సంవత్సరం తిరిగి, మళ్ళీ పండుగ దగ్గిరపడింది. ఎప్పటిలాగే కార్యకర్తలు, మిగిలిన ప్రదర్శనలతో పాటు, మాళవిక నాట్యానికి కూడా ఏర్పాట్లు చెయ్యసాగారు.

ఈ తరుణంలో మాళవిక, కార్యకర్తలకు ఒకసారి వచ్చి తనను కలుసుకోవలసిందిగా కబురు పంపింది. ఇలా గతంలో ఎన్నడూ జరగలేదు. ఆ కారణం వల్ల, కార్యకర్తలు కొద్దిగా ఆశ్చర్యపడుతూ ఆమె ఇంటికి వచ్చారు.

శ్రీమతి లక్ష్మిగాయత్రి



వాళ్ళ సమాధానం విన్న మాళవిక గర్వంగా నవ్వుకున్నది. ఉత్సవాలు ఎంత ఘనంగా జరిగినా, తన నాట్యం లేనిదే ప్రజలు సంతృప్తిపడరు. కనక, తానడిగిన రెండువందలూ తప్పక యిస్తారని, ఆమె భావించింది.

అయితే, మాళవిక దగ్గిర నుంచి వెళ్ళిపోయిన కార్యకర్తలు, జమా ఖర్చులన్నీ లెక్క చూసుకుని, ప్రజల నుంచి మరి కొంత చందా వసూలు చెయ్యనిదే, తాము మాళవికకు రెండువందలు యివ్వలేమని తేల్చుకున్నారు. ఒక పరిమితికి మించి ప్రజల నుంచి చందా వసూలు చేయాలంటే, రాజుగారి అనుమతి కావాలి.

మాళవిక, ఆ వచ్చినవారిని కూర్చోమనైనా చెప్పకుండా, "మీకొక విషయం చెప్పాలని పిలిచాను. ప్రతి సంవత్సరం లాగానే, యీ సంవత్సరం కూడా నూట పదహార్లే యిస్తే, నాకు యిబ్బందిగా వుంటుంది. కనీసం రెండువందలైనా యిస్తే, నాట్యం చెయ్యగలను," అన్నది.

ఇది విని కార్యకర్తలు నిర్ఘాంతపోయారు. ఆమె కోరిన కోరికకంటె, ఆమె మాటతీరూ, నిర్లక్ష్య వైఖరీ వాళ్ళను ఎక్కువగా ఆశ్చర్యపరిచాయి. వాళ్ళు తమలో తాము కొంతసేపు చర్చించుకుని—మాళవికతో ఏ సంగతీ ఆలోచించి చెప్పగలమని, వెళ్ళిపోయారు.

అందువల్ల, కార్యకర్తలు రాజధానీ నగరానికి వెళ్ళి, రాజును దర్శించి, మందాకినీదేవి ఆలయ ఉత్సవాల్లో తమ కెదురైన సమస్యను, ఆయనకు విన్నవించారు.

ఆ దేశపు రాజైన కృష్ణదేవభూపతి గొప్ప పండితుడు; ధార్మికుడు. ఆయన కార్యకర్తలు చెప్పినదంతా విని, "మీరు ప్రజల నుంచి కొత్తగా చందాలేమీ వసూలు చేయవద్దు. ఆ మిగిలిన ఎనభైనాలుగు రూపాయిలూ నేనిస్తాను. మరొక సంగతి. ఆస్థానానికి చంద్రశేఖరు డనే సాధువు వచ్చాడు. ఆయనను మీ గ్రామానికి వెళ్ళ

వలసిందిగా కోరతాను. మాళవిక నాట్య ప్రదర్శనకు కొంచెం ముందుగా, ఆయన ధర్మోపన్యాసం వుంటుంది. అందుకు అవసరం అయిన ఏర్పాట్లు చెయ్యండి!'' అని చెప్పాడు.

కృష్ణదేవభూపతి చెప్పినట్టే, మాళవిక నాట్య ప్రదర్శనకు ముందు రోజున, చంద్రశేఖరుడి ధర్మోపన్యాసానికి ఏర్పాట్లు చెయ్యబడినై. ఇందుకుగాను మాళవికకు ప్రత్యేక ఆహ్వానం పంపబడింది. ఆమె కూర్చునేందుకు ముందు వరుసలో స్థానం కేటాయించారు.

చంద్రశేఖరుడి ఉపన్యాసం ప్రారంభమైంది. ఆయన అనేక లౌకిక, ధార్మిక విషయాల గురించి, ఆసక్తిదాయకమైన రీతిలో ఉపన్యసిస్తున్నాడు: ''ప్రేమకు మరో రూపమే కరుణ. మరో ప్రాణికి జన్మ యిచ్చే స్త్రీ ప్రేమస్వరూపిణి. ఆమె తన కరుణరస పూరితమైన ప్రేమను బాధ్యత గల ఇల్లాలుగా, మాతృమూర్తిగా—పలు విధాలుగా అందరికీ పంచి యిస్తుంది. అయితే, యిక్కడ ఒక చిన్న తేడా వున్నది—

''అమ్మా, నిన్న నువ్వు కనబడకపోతే, నాకు చాలా భయం వేసింది,'' అని బిడ్డ అంటే, తల్లి మనస్సు జాలితో కరిగిపోతుంది. ఇక ఎన్నడూ బిడ్డను విడిచి వెళ్ళరాదనే నిర్ణయానికి వస్తుంది. అలాగే, ''నిన్న నువ్వు లేక ఎంత యిబ్బంది పడిపోయానో!'' అని భర్త అభిమానంగా



భార్యతో అంటే, భర్తకు యిబ్బంది కలిగించి తానెక్కడికీ వెళ్ళకూడదను కుంటుంది. అదే మాట కించిత్తు ప్రేమ, కరుణ, దయా గుణాలు లేని కేవలం ధనమే ప్రధానంగా భావించే స్త్రీతో అంటే—ఆమె చలించకపోగా, అవతలి వారికి తన మీద గల విశ్వాసాన్ని, ఆకర్ష ణనూ ఆధారం చేసుకుని, మరింత అధి కారం చలాయించడానికో, యింకా ఎక్కువగా డబ్బు గుంజడానికో ప్రయత్నిస్తుంది. ప్రేమ తత్వం తెలియక పోవడమే యిందుకు కారణం. సున్నిత మైన మనస్సు ఎదుటివారి అభిమానాన్ని గ్రహిస్తుంది. ఆ గ్రహింపు లేనప్పుడు, మరింతగా డబ్బు రాబట్టాలన్న దురాశకు పోతుంది—''

ఈ విధమైన లౌకిక, ధార్మిక సూక్తులతో చంద్రశేఖరుడి ఉపన్యాసం సాగి పోతూంటే, మాళవిక మనస్సు ఎక్కడ లేని అసంతృప్తికీ, ఆందోళనకూ గురయింది.

చంద్రశేఖరుడి ఉపన్యాసం ముగియ గానే, ఆమె వెళ్ళి అతడి పాదాల ముందు మోకరిల్లి, ''స్వామీ, ఈ అజ్ఞానురాలిని క్షమించి, జ్ఞానభిక్ష దయచేయండి!'' అన్నది కన్నీళ్ళతో.

ఆ వెంటనే కృష్ణదేవభూపతి తన మారు వేషాన్ని తీసివేస్తూ, "మాళవికా, నీ నాట్యం గురించి విన్నాను. నిన్ను ఆస్థానానికి పిలిపించాలని అనుకుంటూ వుండగానే, దేవాలయ కార్యకర్తలు, నా దగ్గరకు వచ్చారు. కళాకారులకు వుండకూడని గర్వాహంకారాలు, నీలో ఉన్నట్టుండి ప్రవేశించాయని తెలియగానే—నేనే వచ్చాను,'' అన్నాడు.

మాళవికకు కలిగిన ఆనందాశ్చర్యాలు అంతా యింతా కాదు. ఆమె రాజాస్థానంలో నర్తకిగా చేరి, కొద్ది సంవత్సరాల్లోనే ప్రధాన రాజనర్తకి అయింది. ఐనప్పటికీ, ఆమె ప్రతి పండుగకూ మరకతపురానికి వచ్చి, మందాకినీదేవి ఆలయంలో నాట్యం చేస్తూండేది.






# వైరాగ్యం

[గత సంచిక తరువాయి]

సన్యాసి కాదలచిన మహాజనకుడు రాజభవనం పై అంతస్తులో కూచుని ఎవరినిగాని చూడలేదు, కిందికి దిగి రాలేదు. ఈ విధంగా నాలుగు నెలలు గడిచాయి. రాజభవనం ఆయన కొక బందిఖానా లాగా తోచి దాని నుంచి ఎలాగైనా బయటపడాలని తీవ్రమైన కోరిక కలిగింది.

ఆయన తన నౌకరును పిలిచి తనకు కాషాయవస్త్రాలూ, మట్టిపాత్రా తెమ్మన్నాడు. మంగలిని పిలిచి తల అంతా క్షౌరం చేయించుకున్నాడు. మర్నాడాయన కాషాయవస్త్రాలు ధరించి, ఒక చేత మట్టి పాత్రా, ఇంకొక చేతిలో కర్రా పట్టుకుని పై అంతస్తు నుంచి దిగి వచ్చాడు. దిగి వస్తుండగా రాణి ఆయనను చూసింది గాని గుర్తించలేదు.

కాని త్వరలోనే నిజం బయటపడింది. సీవలీదేవి మేడ మీదికి వెళ్ళి తన భర్త కేశాలు కింద పడి ఉండటం గమనించింది. రాజభవనం అంతా వెతికారు, రాజు జాడ లేదు. రాజుగారు సన్యసించా డన్నారు. అందరూ గొల్లున ఏడుస్తూ సన్యాసి వెళ్ళిన దిక్కుగా వెళ్ళారు. సీవలీదేవి మిగిలిన రాణులను వెంట బెట్టుకుని వెళ్ళి, తిరిగి రమ్మని ఆయనను బతిమాలింది. కాని ఫలితం లేకపోయింది.

సీవలీదేవి సేనానాయకుణ్ణి పిలిచి ఆయనతో రహస్యంగా, నగరంలో అనేక చోట్ల మంటలు పెట్టించమన్నది. ఆయన అలాగే చేశాడు. అప్పుడు రాణి తన భర్త వద్దకు వెళ్ళి, ''మహారాజా, మీ మిథిలా నగరం అంటుకున్నది. మీ సంపద యావత్తూ అగ్గిపాలవుతున్నది! దాన్ని కాపాడుకోండి!'' అన్నది.

"రాణీ, నా సొత్తంటూ ఏమీ లేనప్పుడు దాన్ని నేను పోగొట్టుకోవటం ఎలా జరుగుతుంది?" అన్నాడు మహాజనకుడు.

ఆయన కదిలి ఉత్తరద్వారంగుండా నగరం దాటి వెళ్ళాడు. రాణీ, ప్రజలూ ఆయన వెంటపడ్డారు. వారు తన వెంట రాకుండా చేయటానికి గాను ఆయన వెనక్కు తిరిగి ప్రజలతో, "ఈ నగరానికి అధిపతి ఎవరు?" అన్నాడు.

"మీరే మహారాజా!" అన్నారు ప్రజలు.

"అయితే ఈ గీత దాటినవారిని దండించండి!" అంటూ ఆయన తన దండంతో దారికి అడ్డంగా ఒక గీత గీసి ముందుకు వెళ్ళాడు. కొంతసేపు ఎవరూ గీత దాటలేదు. కాని తన భర్త వెళ్ళిపోతున్నాడన్న ఆదుర్దాలో సీవలీదేవి గీత దాటి ముందుకు పరిగెత్తింది. వెంటనే ప్రజలు కూడా దాటారు.

త్వరలోనే రాణి తన భర్తను కలుసుకుని, ఆయన కాళ్ళపై బడి, "ఈ ప్రజలను చూడండి. మీరు వెనక్కు తిరిగి రావాలని వారంతా కోరుతున్నారు! వారి కోరిక మన్నించండి," అన్నది.

"నేను వారందరినీ విసర్జించాను. స్నేహితులనూ, చుట్టాలనూ, నా ఇంటినీ, దేశాన్నీ—సమస్తాన్నీ త్యజించాను!" అన్నాడాయన.

"మీరు సన్యసిస్తే నా గతి ఏం కాను?" అన్నది రాణి.



"నీ కుమారుడు మనోవాక్కాయ కర్మలా పాపం ఆచరించకుండా, ధర్మ బద్ధంగా రాజ్యపాలన చేసేటట్టు చూడు," అన్నాడు రాజు.

వారు మాట్లాడుతూ నడిచిపోతూండగా సూర్యాస్తమయం అయింది. ఆ రాత్రికి ఒక సముచిత ప్రదేశంలో మజిలీ ఏర్పాటయింది. తిరిగి తెల్లవారగానే మహా జనకుడు లేచి ప్రయాణం సాగించాడు. రాణి తన పరివారాన్ని వెనకగా రమ్మని, తాను మటుకు తన భర్త వెంబడే నడవ సాగింది.

పోయి పోయి వారొక నగరాన్ని చేరారు. నగర ద్వారం వద్ద కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు. ఒక ఆడపిల్ల చేటతో ఏదో చెరుగుతున్నది. ఆమెకు ఒక చేతిన ఒక గాజూ, రెండవ చేతికి రెండు గాజులూ ఉన్నాయి. ఆమె చేట చెరిగి నప్పుడల్లా ఒక చేతి గాజులు చప్పుడు చేస్తున్నాయి.

ఇది చూడగానే మహాజనకుడికి ఒక ఆలోచన తట్టింది. ఆయన తన భార్యకొక చిన్న పాఠం నేర్పి ఇంటికి పంపేద్దామనుకుని, ఆ పిల్లతో, "అమ్మాయీ, నీ చెయ్యి ఒకటి చప్పుడు చేస్తుందేం? రెండవది చెయ్యదేం?" అన్నాడు.

దానికా పిల్ల, "అయ్యా, ఈ చేతికి రెండు గాజు లుండటం చేత చప్పుడు చేస్తున్నాయి. రెండవది అనర్థం!" అన్నది.



రాజు సీవలీదేవి కేసి తిరిగి, "ఆ పిల్ల అన్న మాట విన్నావా ? రెండవది అనర్థం! నేను నిన్ను వెంట రానిస్తే ఈ పిల్ల చెప్పిన నీతిని తప్పినవాణ్ణవుతాను!" అన్నాడు.

రాణీ తల వంచుకుని తన భర్తను ముందుకు సాగి వెళ్ళనిచ్చింది. కాని మరుక్షణమే అమెకు దుఃఖం పొంగి వచ్చింది. వెంటనే ఆమె పరిగెత్తి తన భర్తను కలుసుకుని అయనతోబాటు నడవసాగింది. వారు కొంత దూరం నడిచి ఒక కమ్మరి కొలిమి దగ్గిరికి వచ్చారు.

అక్కడ కమ్మరి బాణం తయారు చేస్తున్నాడు. బాణం సూటిగా ఉన్నదో లేదో చూడటాని కతను బాణాన్ని తన కంటికి ఎదురుగా పట్టుకుని రెండవ కన్ను మూసుకున్నాడు.

"నాయనా, చూడటానికి నీకు రెండు కళ్ళుండగా ఒకదాన్ని మూస్తావెందుకు?" అని రాజు కమ్మరిని అడిగాడు.

"రెండు కళ్ళూ తెరిస్తే సూటి తెలుస్తుందా, బాబూ? బాణం వంకర లేకుండా ఉందో లేదో చూడాలంటే ఒక కన్నుతోనే చూడాలి. రెండవది అనర్థం!" అన్నాడు కమ్మరి.

"విన్నావా, దేవీ?" అన్నాడు మహా జనకుడు తన భార్యతో. తన భర్త ఇక తనకు దక్కడని సీవలీదేవికి తెలిసి పోయింది. ఆ బాధతో ఆమె స్పృహ తప్పి పడిపోయింది. ఆ సమయంలో మహా జనకుడు అరణ్యంలో ప్రవేశించి ఎటో వెళ్ళిపోయాడు.

త్వరలోనే పరివారం వచ్చింది. మూర్ఛపోయిన రాణి ముఖంపై నీరు చల్లి మూర్ఛతేర్చారు. ఆమె మౌనంగా మిథిలానగరానికి తిరిగి వెళ్ళి, తన కుమారుడైన దీర్ఘాయువును రాజ్యాభిషిక్తుణ్ణి చేసింది.

అమె తిరిగి రాజభవనంలో అడుగు పెట్టలేదు. తోటలో ఒక పర్ణశాల కట్టుకుని సన్యాసినిలాగా జీవించింది.

మహాజనకుడు హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసి సిద్ధి సంపాదించాడు.






మన దేవాలయాలు :

# బదరీనాథ్–కేదారనాథ్

పురాతన కాలం నుంచీ భారతీయులు హిమాలయ పర్వతాలను పవిత్రమైనవిగా భావిస్తున్నారు. మహాకవి కాళిదాసు హిమాలయాన్ని 'దేవతాత్మ'గా వర్ణించాడు. దేవతలు, గంధర్వులు, యక్షులు అక్కడ వసిస్తారన్న నమ్మకం ఉన్నది. జీవనదులన్నీ హిమాలయాల నుంచే పుట్టి ప్రవహిస్తున్నాయి.

జిజ్ఞాసువులైన సాధువులు చాలామంది ధ్యానం చేసుకోడానికి ప్రశాంత వాతావరణం వెతుక్కుంటూ హిమాలయాలకు వస్తూ ఉంటారు. యుగయుగాలుగా అసంఖ్యాకమైన సన్యాసులు హిమాలయాలలో ఉంటున్నారు. ఈ పర్వతాలలో ఎన్నెన్నో పవిత్ర స్థలాలు ఉన్నాయి.





హిమాలయాలలోని పవిత్రస్థలాలలో బదరీనాథ్ ప్రధానమైనది. విష్ణు క్షేత్రమైన ఈ పవిత్ర స్థలంలోనే వ్యాస మహర్షి చెబుతూ వుంటే విఘ్నేశ్వరుడు మహాభారతం రాశాడు!




చాలా కాలం కిందటే బదరీనాథ్‌లో విష్ణు ఆలయం నిర్మించబడింది గాని, అది కొండచరియలు విరిగి పడడంతో నాశనమైపోయినట్టు భావించబడుతున్నది. అప్పుడు స్వామి విగ్రహం అలకానందనదిలో మునిగిపోయింది.

భారతయాత్ర సందర్భంలో ఆదిశంకరులు ఈ స్థలాన్ని కూడా సందర్శించారు. ధ్యానం ద్వారా స్వామి విగ్రహం ఎక్కడ ఉన్నదీ కనుగొని, దానిని తెచ్చి నూతనంగా నిర్మించిన ఆలయంలో పునఃప్రతిష్ఠ గావించారు. పూజలకు ఏర్పాట్లు చేశారు.





ఆదిశంకరులు చేసిన ఏర్పాట్లు ఇప్పటికీ కొనసాగుతూనే ఉన్నవి. ఒకప్పుడు కాలినడకన ఈ గుడికి వెళ్ళాలంటే మార్గమధ్యంలో ఎన్నో కష్టనష్టాలు ఎదుర్కోవలసి వచ్చేది. కాని ఈనాడు రవాణా వాహనాలు లభ్యమవుతున్నాయి.

విపరీతంగా మంచుకురవడం వల్ల, సంవత్సరంలో ఆరు నెలలపాటు ఈ దేవాలయం మూయబడి ఉంటుంది. ఆ సమయంలో ఆలయ పూజారులు అక్కడ ఉండడానికిగానీ, యాత్రీకులు రావడానికి గానీ సాధ్యపడదు. అయితే అప్పుడు దేవుడి పూజలు మాత్రం ఆగవు. ఆ దైవవిగ్రహ ప్రతిరూపానికి జోషీమఠంలో పూజలు జరుగుతాయి.





ఆలయం మూయడానికి ముందు, పూజారి గుడిలో విగ్రహం ఎదట దీపం వెలిగిస్తాడు. వేసవి ప్రారంభమయ్యాక గుడి తెరవబడేప్పుడు, ఆ దీపం వెలుగుతూనే వుంటుంది. ఇది చాలా కాలంగా జరుగుతూన్న గొప్ప విశేషంగా చెబుతారు.

సముద్రమట్టానికి 11,735 అడుగుల ఎత్తులో కేదారనాథ్ ఆలయం ఉన్నది. ఇది సుప్రసిద్ధమైన శివక్షేత్రం. ఇక్కడికి రావడం చాలా కష్టసాధ్యమైనప్పటికీ, శతాబ్దాల తరబడి, అసంఖ్యాకులైన భక్తులు యాత్రలు సాగిస్తూనే ఉన్నారు.





పంచపాండవులు ద్రౌపదీ సహితంగా ఈ మార్గం గుండానే మహాప్రస్థానం సాగించారట. దారిలో మొదట ద్రౌపది మరణించింది. ఆ పైన సహదేవుడు మార్గాయాసాన్ని భరించలేక కేదారనాథ్ సమీపంలో మరణించాడు.

రుద్రహిమాలయమని పేరుగాంచిన ఈ ప్రాంతంలో శివస్వరూపాన్ని సందర్శించి ధర్మరాజు పూజించాడట. అప్పటి నుంచీ కేదారనాథ్‌లో శివారాధన ప్రారంభమై ఈనాటికీ కొనసాగుతూ ఉన్నది.






భక్తితో యాత్రికులు మార్గమధ్యంలోని కష్టాలను సాహసంతో అధిగమిస్తూ, కేదారనాథ్‌ను దర్శిస్తూ ఉంటారు. బదరీనాథ్ లాగా కేదారనాథ్ ఆలయం కూడా సంవత్సరంలో ఆరు నెలలు మూయబడి ఉంటుంది. ఆ సమయంలో ఈ దైవవిగ్రహ ప్రతిరూపానికి ఉఖీమఠంలో పూజలు చేస్తారు.



# విజయరహస్యం

ఉజ్బెకిస్థాన్‌లోని ఒక రాజ్యానికి కమలుద్దీన్ అనే యువకుడు సుల్తాను అయాడు. అతడు ఎప్పుడు చూసినా విందులతో, వినోదాలతో కాలం గడిపేవాడు. పరిపాలనా వ్యవహారాలను గానీ, ప్రజాసమస్యలను గానీ ఏమాత్రం పట్టించుకునేవాడు కాదు.

ఒకనాడు సుల్తాను ఉద్యానవనంలో ఒంటరిగా ఉన్నప్పుడు, ప్రధానమంత్రి ఆయనను కలుసుకుని, ''ప్రభూ, మన రాజ్యం మీదికి పొరుగురాజ్యం సుల్తాను దండెత్తనున్నాడని చారుల ద్వారా తెలిసింది. దాడిని ఎదుర్కోడానికి మనం వెంటనే సన్నాహాలు చేయాలి,'' అన్నాడు.

సుల్తాను మంత్రికేసి హేళనగా చూస్తూ, ''మన దగ్గర పెద్ద సైన్యం ఉన్నది. అసమాన ధైర్యసాహసాలు గల సేనానాయకులున్నారు. అలాంటప్పుడు ఎవరి దాడికీ మనం ఏమాత్రం భయపడనవసరం లేదు,'' అన్నాడు.

ప్రధానమంత్రి మారుమాటాడకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మంత్రి హెచ్చరించినట్టుగానే, ఒక వారం గడిచేలోపల, ఒకనాటి రాత్రి శత్రు సైనికులు కోటను ముట్టడించారు. సేనానాయకులు సైన్యాన్ని నడిపి శత్రువులను ఎదుర్కొన్నారు. కాని, వాళ్ళు శత్రు సైనికుల ధాటికి తట్టుకోలేకపోయారు. కోట శత్రువుల వశమయింది.

సుల్తాను కమలుద్దీన్ ఇక చేసేదిలేక, అక్కడి నుంచి రహస్యంగా పారిపోయి, తన బంధువు అయిన మరొక సుల్తాను కోటలో తలదాచుకున్నాడు.

ఒకనాడు కమలుద్దీన్ తన బంధువుతో, ''పోగొట్టుకున్న నా రాజ్యాన్ని నేను మళ్ళీ

అరేబియా కథ

సంపాదించడానికి నీ సైన్యాన్ని సహాయంగా పంపకూడదూ ?'' అన్నాడు.

అతడు అందుకు అంగీకరించి, ''నువు నీ రాజ్యాన్ని మళ్ళీ సంపాదించడంకన్నా నాకు సంతోషకరమైన విషయం ఏమున్నది ?'' అని కొంత సైన్యాన్ని కమలుద్దీన్ వెంట పంపాడు.

సైన్యాన్ని వెంటబెట్టుకుని కొంత దూరం వెళ్ళిన కమలుద్దీన్‌కు దారిలో చల్లని నీడనిచ్చే ఒక చెట్టు కనిపించింది. దానిని చూడగానే ''ఇంతమంది సైనికులున్నారు కదా, వీళ్ళు సునాయాసంగా కోటను జయించి నాకు అప్పగించలేరా ? దీనికి నేను కూడా వెళ్ళాలా ?'' అని ఆలోచించ సాగాడు.

మరుక్షణమే సేనానాయకుణ్ణి పిలిచి, ''మీరు వెళ్ళి శత్రుసైనికులను పారదోలి కోటను వశపరచుకుని, నాకు కబురు పంపండి. నేను ఈ చెట్టు నీడనే ఉంటాను,'' అని ఆజ్ఞాపించాడు.

సైన్యం ముందుకు నడిచింది. కమలుద్దీన్ గుర్రాన్ని చెట్టుబోదెకు కట్టివేసి, అక్కడే కూర్చుని ద్రాక్ష పానీయం తాగుతూ, తన సైన్యం కోటను వశపరచుకుందన్న విజయవార్తకోసం కలలు గన సాగాడు. కాని సాయంకాలానికల్లా, తన సైనికులు చాలామంది యుద్ధంలో మరణించినట్టూ, మిగిలినవారు శత్రువులకు బందీలుగా పట్టుబడి పోయినట్టూ, అతనికి వర్తమానం అందింది !



ఆ వార్త వినగానే అతనికి మతిపోయి నంత పనయింది. తన ముఖాన్ని బంధువుకు చూపలేకపోయాడు. అక్కడి నుంచే పిచ్చివాడిలా ఎక్కడెక్కడో తిరిగి, నానా అవస్థలుపడి ఆఖరికి ఖదీదాన్ అనే సుల్తాను కొలువులో చేరాడు.

ఖదీదాన్ దగ్గర ఉన్న సైన్యాన్ని చూసి, ''ఇంత పెద్ద సైన్యమే గనక ఉంటే, పోగొట్టుకున్న రాజ్యాన్ని ఈ క్షణమే సులభంగా జయించుకోగలను,'' అనుకున్నాడు కమలుద్దీన్. అయినా, తను ఎవరైనదీ చెప్పకుండా, తనకు ఏర్పడిన దుస్థితికి విచారిస్తూ, సుల్తానుకు అంగరక్షకుడిగా ఉద్యోగం చేస్తూ కాలం గడపసాగాడు.

ఒకసారి హఠాత్తుగా పక్కరాజ్యం సైనికులు, ఖదీదాన్ కోటను ముట్టడించారు. అప్పుడు ఖదీదాన్ స్వయంగా సేనకు నాయకత్వం వహించి శత్రు సేనలను ఎదుర్కొన్నాడు. అతడి సైన్యంలో యోధానయోధులైన సైనికులూ, ధైర్య సాహసాలకు పేరొందిన సేనానాయకులూ ఉన్నారు. అయినా ఖదీదాన్ స్వయంగా సేనకు నాయకత్వం వహించడం కమలుద్దీన్‌కు అమితాశ్చర్యం కలిగించింది!

యుద్ధంలో ఖదీదాన్ సైనికులు శత్రు సైనికులను అవలీలగా ఓడించారు.

మర్నాడు కమలుద్దీన్ ఖదీదాన్‌ను సమీపించి, ''ప్రభూ, సమర్థులైన సేనా నాయకులూ, అసంఖ్యాకులైన సైనికులూ



ఉన్నా, తమరే ఎందుకు ప్రాణాలకు తెగించి సేనలకు నాయకత్వం వహించి యుద్ధరంగంలోకి ప్రవేశించారో నాకు అంతుపట్టడం లేదు," అన్నాడు.

"కేవలం సమర్థులైన సేనానాయకులూ, పెద్ద సైన్యమూ మాత్రమే యుద్ధంలో విజయాన్ని సాధించగలవనుకోవడం సరికాదు. రాజ్యాధినేత అయిన సుల్తాన్ ముందుండి వాళ్ళను నడపాలి. అప్పుడే వాళ్లకు ఉత్సాహం కలిగి పోరాడగలరు. విజయం సులభసాధ్యమవుతుంది. ఇదే విజయరహస్యం!" అన్నాడు ఖదీదాన్ చిన్నగా నవ్వుతూ.

ఖదీదాన్ మాటలలోని సత్యం కమలుద్దీన్‌కు అర్థమయింది. అతడు ఆ రాత్రే గుర్రం మీద తన రాజ్యానికి బయలుదేరాడు. తెల్లవారేసరికి కోటద్వారం చేరుకున్నాడు.

కోట ద్వారాలను కాపలాకాసే సైనికులు అతన్ని లోపలకు వెళ్ళనీయకుండా అడ్డుపడ్డారు.

"ఏమిటీ, నా సైనికులైన మీరే నన్ను గుర్తుపట్టలేదా? నేను మీ సుల్తాను కమలుద్దీన్‌ను," అన్నాడు గట్టిగా సుల్తాను.

ఆ సమయంలో దాపులఉన్న ఒక భవనంలో, అధికారులు కొందరు చేరి, కోటను పట్టుకున్న కొత్త సుల్తాను దుష్పరిపాలన నుంచి ఎలా బయటపడటమా అని ఆలోచనలు జరుపుతున్నారు. వాళ్ళు కమలుద్దీన్ కంఠస్వరం విని అక్కడికి వచ్చి, అతనికి నమస్కరించారు.

కమలుద్దీన్, రాజ్యంలోనే రహస్యంగా ఉంటూ, అధికారులు చేయదలచిన తిరుగుబాటుకు స్వయంగా నాయకత్వం వహించాడు. రెండు వారాలలో, పథకం ప్రకారం తిరుగుబాటు జరిపి, శత్రువును చంపి, కమలుద్దీన్ తన సింహాసనాన్ని దక్కించుకున్నాడు. అప్పటి నుంచి అతడు విలాసజీవితాన్ని మానుకుని, ప్రజాక్షేమమే ప్రధానంగా భావించి పరిపాలన జరిపి, అచిరకాలంలోనే ప్రజల మన్ననలు పొందాడు.





# సలహాల శివుడు

రామాపురంలో వల్లభయ్య అనే రైతుకు, శివుడు ఒక్కడే కొడుకు. చిన్నప్పటి నుంచీ శివుడు మహా బద్ధకస్థుడు. అతడికి, అటు చదువులో గానీ, ఇటు పొలం పనులలో గానీ ఏమాత్రం ఆసక్తి వుండేది కాదు. సుష్టుగా తిని మన్నుతిన్న పాములా ఎప్పుడూ పడుకుని వుండేవాడు. యుక్త వయసు వచ్చినా, అతడి బద్ధకంలో మాత్రం ఎటువంటి మార్పూ రాలేదు. ఇది వల్లభయ్యకు చెప్పలేనంత బాధగా వుండేది.

వల్లభయ్య ప్రాణస్నేహితుడైన దేవయ్యకు, ఒకసారి ఒక చిక్కు సమస్య ఎదురయింది. ఆయన కూతురుకు సంబంధం కుదిరింది. కాబోయే అల్లుడికి పట్నంలో ఉద్యోగం. ఇచ్చే కట్నం పొలంగా కాకుండా, ధనరూపంలో కావాలని కోరాడు. దేవయ్య అందుకు ఒప్పుకున్నాడు; ముహూర్తం రోజు కూడా నిర్ణయం జరిగిపోయింది.

బంగారం లాంటి తన పొలం, అమ్మజూపాలేగాని, క్షణాల్లో అమ్ముడైపోతుందనే నమ్మకం దేవయ్యకున్నది. అందువల్ల, పెళ్ళి రోజు దగ్గిరపడేవరకూ నిర్లక్ష్యం చేసి, అప్పుడు అమ్మజూపాడు. అయితే, దేవయ్య అవసరం ఎరిగిన గ్రామస్థులు, పొలాన్ని చాలా తక్కువ ధరకు అడిగారు.

దేవయ్య, వల్లభయ్య ఇంటికి వచ్చి, జరిగింది చెప్పి, ''అవతల ముహూర్తం దగ్గిరవుతున్నది. ఏం చేయాలో తోచడం లేదు,'' అన్నాడు.

వల్లభయ్య ఏం సలహా యివ్వాలో అర్థం కాక, మౌనంగా వూరుకున్నాడు. అంతలో, మంచం మీద బద్ధకంగా పడుకునివున్న శివుడు ఆవులిస్తూ, ''ఇందులో తోచేందుకేమున్నది? మీ పొలం జమీం

ఎన్. శివనాగేశ్వరరావు



దారుగారి పొలానికి అనుకునే గదా వున్నది. ఆయనకు సంగతి చెప్పండి. మంచి ధరకు కొంటాడు,'' అన్నాడు.

''నిజమే! జమీందారుగారిని చూడాలన్న ఆలోచనే, నాకు రాలేదు!'' అంటూ దేవయ్య హడావిడిగా వెళ్ళిపోయాడు.

తర్వాత, దేవయ్య పొలాన్ని జమీందారు న్యాయమైన ధరకు కొనడం, అనుకున్న ముహూర్తానికి దేవయ్య కూతురు పెళ్ళి అవడం—అంతా చకచకా జరిగిపోయింది. దేవయ్య, శివుడికి ప్రత్యేకంగా విందుభోజనం పెట్టాడు.

ఇది జరిగాక, ఒకనాడు వల్లభయ్య, దేవయ్యతో పిచ్చాపాటీ మాట్లాడుతూ, ''మా శివుడు ఎందుకూ పనికిరానివాడుగా తయారయ్యాడు!'' అంటూ తన బాధను వెల్లడించాడు.

దేవయ్య కొంచెం సేపు ఆలోచించి, ''బద్ధకం వల్ల వాడలా వున్నాడేగాని, వాడి బుద్ధి మహా చురుకైనది. నీవలా చూస్తూండు, వాణ్ణి చాకులా తయారు చేసే బాధ్యత నాది,'' అన్నాడు.

తరవాత ఆయన శివుణ్ణి నిద్రలేపుతూ, ''ఒరే, శివా! అందరూ నిన్ను బద్ధకస్థుడనీ, పనికిమాలినవాడనీ అంటూంటే, నీకు బాధగా లేదా?'' అని అడిగాడు.

శివుడు మూతలుపడుతున్న కళ్ళను బలవంతాన తెరుస్తూ, ''వాళ్ళు అనుకుంటున్నది, నిజమే గదా! ఎందుకు బాధపడాలి? నాకు నిజంగానే ఏ పనీ చేతకాదు,'' అన్నాడు.

''ఏమో, నాకు మాత్రం నువ్వు మహా మేధావిలా కనిపిస్తున్నావు. నా పొలం అమ్మకం విషయంలో, నువ్వు జమీందారుగారిని చూడమని యిచ్చిన సలహా, బ్రహ్మాండంగా లాభించింది. అందువల్ల, ఇప్పటి నుంచీ నువ్వు సలహాలు యివ్వడం అనే వ్యాపకం పెట్టుకో. ఆ కారణంగా, జనం లాభం పొందుతారు; నీకూ కాస్తో కూస్తో డబ్బు ముట్టుతుంది,'' అన్నాడు దేవయ్య.



శివుడు మంచం మీద మరొక పక్కకు ఒత్తిగిల్లుతూ, "మీరు, నాకు అనవసరమైన శ్రమకలిగిస్తున్నారు. నేనేమీ మేధావిని కాదు," అన్నాడు.

"ఆ సంగతి తేల్చవలసింది నువ్వు కాదు, మేము. నువ్వు మాత్రం కొద్ది రోజులపాటు, నేను చెప్పినట్టు చెయ్యి," అని దేవయ్య, శివుణ్ణి ఇంటి నడవాలో పరిచిన చాప మీద కూర్చోబెట్టాడు.

తరవాత ఆయన ఒక పలక మీద—ఇక్కడ సలహాలు యివ్వబడును—అన్న మాటలు అందంగా రాసి, శివుడి పక్కన ఒక కర్రకు వేళ్ళాడగట్టాడు. దారే పోయే వాళ్ళు ఇది చూసి నవ్వుకోసాగారు. వారం గడిచినా ఎవరూ సలహాలకు రాలేదు.

"ఇదంతా ఎందుకొచ్చిన తగలాటం? హాయిగా నన్ను నిద్రపోనీ," అన్నాడు శివుడు, దేవయ్యతో.

దేవయ్య అందుకు ఒప్పుకోక, "శివా, కాస్త ఓపికపట్టు. నేనూ, నీతోపాటు కూర్చుంటున్నాను గదా," అన్నాడు.

ఇది జరిగిన మర్నాడు, వరహాలనే గొర్రెల కాపరి అటుగా పోతూ ఆగి, దేవయ్యను, "ఏమిటిదంతా?" అని అడిగాడు.

"చిక్కు సమస్యలతో సతమతమయ్యే వాళ్ళకు, శివుడు సలహాలిచ్చి పరిష్కార మార్గాలు చూపెడతాడు. ఎవరికి తోచింది వాళ్ళివ్వండి!" అన్నాడు దేవయ్య.

"అలా చెప్పరేం మరి!" అంటూ వరహాలు చిన్నగా నవ్వి, "చూడు, శివుడూ! ఊరివెలపల పోరంబోకల్లో పచ్చిక దొరక్క, మా గొర్రెలను కొంత ప్రాంతాలకు తోలుకుపోతున్నాం. అక్కడ తోడేళ్ళబెడద జాస్తిగా వున్నది. రాత్రివేళ అందరం నిద్రపోకుండా కాపలా కాస్తున్నా, అవి ఒకటో, రెండో గొర్రెలను ఎత్తుకు పోతున్నవి. ఏం చేస్తే, ఈ బాధ తప్పుతుందో చెప్పు," అని అడిగాడు.

శివుడు నిద్రమత్తుతో కళ్ళు మూసి, తెరుస్తూ, "ఇక నుంచి రాత్రివేళ, మీలో



శివుడి గురించి, పక్క ఊరి జమీందారుకు తెలిసింది. ఆయన కబురు చేసి శివుణ్ణి పిలిపించి, "నువ్వు సలహా లివ్వడంలో మంచి ఘటికుడివని విన్నాను. నన్నొక సమస్య వేధిస్తున్నది. మా అల్లుడు మద్యపానానికి దాసుడైపోయాడు. అతడి అలవాటు మాన్పించడం, నావల్ల కాలేదు. నీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

"అయ్యా, ఒక పని చెయ్యండి. ఎవరైనా వైద్యుడి దగ్గిర వాంతులయే మందు తీసుకుని, దాన్ని మీ అల్లుడు తాగే మద్యంలో రహస్యంగా కలపండి. ఆయన వాంతులు చేసుకుని స్పృహ కోల్పోతాడు. అప్పుడు మీరు కాస్త హడావిడి చేసి వైద్యుణ్ణి పిలిపించి, ఆయనచేత విరుగుడు మందు యిప్పించండి. తర్వాత వైద్యుడి చేత, మీ అల్లుడికి, కల్తీ మద్యం వల్ల అలా జరిగిందనీ, విరుగుడు మందు వేయడం కొంచెం ఆలస్యం అయుంటే, ప్రాణానికే ప్రమాదం వచ్చి వుండేదనీ చెప్పించండి. ఇక, మీ అల్లుడు మద్యం జోలికి పోడు," అని శివుడు సలహాయిచ్చాడు.

ఆ రోజు రాత్రి జమీందారు శివుడి సలహాను అమలు చేశాడు. మర్నాటి నుంచీ, ఆయన అల్లుడు ప్రాణం మీది తీపికొద్దీ, మద్యాన్ని విషంతో సమానంగా చూడసాగాడు. జమీందారు, శివుణ్ణి

ఒకణ్ణి ఏ చెట్టు మీదో వుండి డప్పు మోగిస్తూ వుండమనండి. ఆ మోత విని ఏ తోడేలూ మీ గొర్రెల కేసి రాదు. మిగతా వాళ్ళంతా హాయిగా నిద్రపొండి," అని సలహా యిచ్చాడు.

"ఆహా, ఎంత మంచి సలహా! మా రాచిప్పబుర్రలకు, యీ ఆలోచనే తట్ట లేదు," అని, వరహాలు ఒక కానీ శివుడి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

శివుడి సలహావల్ల, గొర్రెల కాపరులకు తోడేళ్ళ బాధ తప్పిందని తెలిసి, ఊళ్ళో వాళ్ళు సలహాలకోసం శివుడి దగ్గిరకు రాసాగారు. క్రమంగా అతడి సంపాదన పెరగసాగింది.

మెచ్చుకుని, వంద వరహాలు బహుమానంగా యిచ్చాడు.

ఇది జరిగిన నెల తరవాత, ఆ దేశపు రాజు మహేంద్రపాలుడి మీద, పొరుగు రాజైన విక్రమవర్మ యుద్ధం ప్రకటించాడు. ఆ సమయంలో మహేంద్రపాలుడు అనారోగ్యంతో బాధపడుతున్నాడు. ఈ సంగతి తెలిసే, విక్రమవర్మ యుద్ధానికి కాలుదువ్వడం జరిగింది.

జమీందారు, మహేంద్రపాలుడికి మంచి ఆశ్రితుడు. ఆయన రాజును కలుసుకుని, శివుడి సలహావల్ల, తానెలా లాభం పొందిందీ చెప్పాడు.

మహేంద్రపాలుడు, శివుణ్ణి ఆహ్వానించి సంగతి వివరించాడు. శివుడు, ఆయనతో, "ప్రభూ, మీ అనారోగ్యం కేవలం కపట నాటకమే అని పుకారు పుట్టించండి. మీ అంతట మీరు విక్రమవర్మ మీదికి యుద్ధానికి పోకుండా, అతడు మీ మీదికి దండెత్తి వచ్చేలా చేసి, ఓడించాలన్న వ్యూహంతో ఇలా అనారోగ్యం నటిస్తున్నట్టు ఆయనకు తెలిసేలా చేయండి. ఇందుకు మీరు, రోజూ అంతఃపురంలో నృత్యగాన విలాసాలలో మునిగి తేలుతున్నట్టు, నీలివార్తలు ప్రచారం చేయించండి. అయితే, యుద్ధానికి మాత్రం తమరు అన్ని సన్నాహాలూ చేస్తూండాలి. తన గూఢచారుల ద్వారా, యీ సంగతులు విన్న విక్రమవర్మ, సరిహద్దులు దాటే ప్రయత్నం మాని వెనుతిరిగి పోతాడు," అని సలహా యిచ్చాడు.

రాజు, శివుడు చెప్పినట్టే చేశాడు. వారం గడిచేలోపల, గూఢచారుల ద్వారా సంగతి విన్న విక్రమవర్మ, యుద్ధం చేయాలన్న ఆలోచన మాని, సరిహద్దుల్లో వేయించిన సైనికశిబిరాలు ఎత్తివేయించి, రాజధానికి వెళ్ళిపోయాడు.

మహేంద్రపాలుడు ఇది విని పరమానందం చెంది, శివుణ్ణి పెద్ద వేతనం మీద తన ఆంతరంగిక సలహాదారుగా నియమించుకున్నాడు.

ఆనాటి నుంచీ శివుడి పేరు సలహాల శివుడుగా స్థిరపడిపోయింది.






అనగనగనగా ఒక మాంత్రికుడు. వాడు చాలా వృద్ధు. ఆ ఊరిలో ఒక సందులో చిన్న దుకాణం పెట్టుకుని వస్తువు లమ్ముకొంటూ కాలక్షేపం చేస్తూ ఉండేవాడు. వాడు మాంత్రికుడన్న సంగతి ఒక పిల్లవాడికి తప్ప మరెవరికీ తెలియదు.

ఆ పిల్లవాడికి తల్లి లేదు. తండ్రి ఏదో పనిలోకి పోతూ వుండేవాడు. అందుకని ఏమీ తోచక, వాడు మాంత్రికుడి దుకాణం కనిపెట్టుకొని ఉండి, వచ్చే వాళ్ళకు వస్తువులన్నీ తీసి చూపించేవాడు.

ఒక్క వస్తువు ముట్టుకు తాకవద్దనే వాడు మాంత్రికుడు. అదే ఒక చిత్రమైన తంబుర. దుకాణం దగ్గిరకు వచ్చిన ప్రతి వాళ్ళూ ''ఆ తంబుర ఎంత కిస్తావు?'' అని అడిగేవారు.

''ఇది అమ్మకానికి కాదయ్యా!'' అని చెప్పేవాడు మాంత్రికుడు.

లక్షరూపాయలు ఇస్తానన్నా సరే, ఆ తంబుర మాత్రం తాకనిచ్చేవాడు కాదు.

ఒక రోజున ఆ పిల్లవాడు, ''తాతా! తాతా! కోరినంత ధనం వస్తుందికదా! తంబుర అమ్మరాదా?'' అని అడిగాడు.

''నువ్వు పెద్దవాడవయ్యాక దానిని నీ కిచ్చేస్తాను. అది అమరగానం పాడుతుంది. ఆ పాటకు లోకులందరూ నిశ్చేష్టులై నీ వేపే తిరిగి వింటారు,'' అని మాంత్రికుడు తంబుర చేతబట్టి, తీగలు శ్రుతి చేసేసరికల్లా దివ్యగానం వినవచ్చింది.

ఐతే, ఇటువంటి గానం ఎలా వినబడుతున్నదీ, అని అందరకూ ఆశ్చర్యం కలిగేది. ఈ తంబుర లోపల మాంత్రికుడు ఒక దేవకన్యను బంధించివేశాడు. ఆమెను ఇలా బంధించి ఎంతో కాలమయింది.

అప్పటినించీ, మాంత్రికుడికి జడిసి అతడు కావాలన్నప్పుడల్లా ఆమె గానం



చేస్తూనే వుంటుంది. ఆ దేవకన్యకు ఈ పిల్లవాడంటే అమిత ప్రేమ. అందుచేత, వాడు తంబుర చేత పట్టినప్పుడల్లా అద్భుతమైన దివ్యగానం పాడి వినిపించేది. దేవకన్య చేసే గానానికి పిల్లవాడు ఆనంద బాష్పాలు రాల్చేవాడు.

ఇలా వుండగా పిల్లవాడి పుట్టినరోజు పండగ వచ్చింది. ఆ రోజున వాడు వచ్చి నమస్కరించగానే, వానిని దీవించి, "మనమడా! నేను నీకిస్తానన్న తంబుర ఇదిగో! దీనిని నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో." అని చెప్పి దానిని బహుమతి చేశాడు మాంత్రికుడు.

అందుకు పిల్లవాడు అబ్బురపడుతూ, "నాకు అచ్చంగా ఇచ్చేశావా, తాతా ? నా ఇష్టం వచ్చినట్టు చేసుకోవచ్చా ?" అని మళ్ళీ మళ్ళీ అడిగాడు.

"చేసుకోవోయ్, మనమడా! దానికి అభ్యంతరం ఏముంది," అన్నాడు తాత.

వెంటనే పిల్లవాడు తంబుర చేతబట్టి భుజానికి ఆనించుకుని, తీగలు మోగించి శ్రుతిచేశాడు. అప్పుడు తంబురలోనించి, "నాయనా! నా బిడ్డా! నన్నీ బంధము నుండి విడుదల చెయ్యి. నాకు ప్రియమైన అరణ్యాల్లోకి పోనియ్యి. నా లోకానికి నన్ను చేరుకోనియ్యి," అంటూ అతి దీనంగా దేవకన్య పాడింది.

పిల్లవాడు సగంలో ఆపివేసి; గిరుక్కున మాంత్రికుని వేపు తిరిగాడు. "తాతా! ఈ తంబుర నాకు అచ్చంగా ఇచ్చివేశావా? దేవకన్యను బంధం నుండి విడుదల చేయవచ్చా?" అని ఆత్రంతో అడిగాడు.

"తంబురలో దేవకన్య ఉన్నదని ఎలా తెలుసు నీకు?" అన్నాడు ముసలివాడు.

అందుకు బాలుడు, "దేవకన్య వాక్కులు నాకు అనేకసార్లు వినిపించినై. ఈ బంధం నుండి విడిపించమని ఇది వరకు ఎన్నోసార్లు ఆమె నన్ను కోరింది. ఇప్పుడు చేస్తున్న గానంలో అతి దీనంగా ఆమె నన్ను వేడుకుంటున్నది. ఆమె బాధ చూసి ఇక ఎంతమాత్రమూ నేను

సహించలేను. ఈ తంబుర అచ్చంగా నాదే ఐతే, ఇప్పుడే ఆమెను విడిపించేస్తాను,'' అని తన హృదయంలోని ఆవేదన వెలిబుచ్చాడు.

''ఆమెను వదిలేస్తివంటే నీవింక దివ్య గానం చెయ్యలేవు. ఆమె దానిలోపల ఉన్నంతసేపే నీవు చేసే గానం దివ్యంగా వుంటుంది. ఆ గానానికి తన్మయత్వం పొంది, లోకమంతా నీ పాదాల దగ్గర వుంటుంది. ఆమెను వదిలేసినప్పటికీ, నువ్వు తంబుర మీద పాడవచ్చు. అయితే ఆ పాట బిచ్చగాళ్ళు పాడే పాటలాగే వుంటుంది. దివ్యగానం వల్ల కీర్తి, ఐశ్వర్యం, అధికారం అన్నీ వస్తవి. కాదంటే దారిద్ర్యంలో ఓలలాడుతావు. కనుక, ఏ మార్గం కావాలో కోరుకో,'' అన్నాడు మాంత్రికుడు.

అప్పుడు పిల్లవాడు, ''తాతా! దేవ కన్యని నేను బంధించి వుంచలేను,'' అంటూ తంబుర తీసి, నేలని వేసి కొట్టాడు.

తంబుర ముక్క ముక్కలయింది. అందులోనించి ఒక దేవకన్య ఎగిరి బయటికి వచ్చింది.

''నాయనా! నీవు మంచి హృదయం కలవాడవు. నన్ను బంధం నుండి విడిపించావు. చాలా సంతోషించాను. ఈ తంబుర లోపల ఇంక నే నుండను. నా మహిమవల్ల ఇంతవరకూ నువ్వు చేస్తూ వచ్చిన దివ్య గానం ఇక ముందు చెయ్యలేవు. అయితే, నీ వద్దకు వచ్చి, దివ్యగానం చేస్తూ వుంటాను. అది నువు రాసుకుని గ్రంథస్థం చేసి, లోకానికి అందించు. గొప్ప కీర్తి వస్తుంది,'' అని చెప్పి అదృశ్యమయింది.

మాంత్రికుడు చిరునవ్వు నవ్వుతూ, పగిలిపోయిన తంబుర ముక్కలను ఏరి దగ్గరగా చేర్చి అతికించివేసి, ఎప్పటిలాగ దానిని పిల్లవాని కిచ్చాడు.

''మనమడా! నీ త్యాగానికి, సాహసానికి మెచ్చాను. ఇదిగో తంబుర తీసుకో. సుఖంగా వుండు,'' అని వాని చేతి కిచ్చి మాయమయ్యాడు మాంత్రికుడు.





# శివపురాణం

పార్వతి విష్ణువు వద్దకు వెళ్ళి, "అన్నా, నా భర్తను గజాసురుడు లింగరూపంలో తన హృదయంలో దాచుకున్నాడు. నువు ఆయనను తిరిగి కైలాసానికి చేర్చాలి," అని ప్రార్థించింది.

విష్ణువు అలాగే చేస్తానని మాట ఇచ్చాడు. శివుడు కైలాసానికి తిరిగి వచ్చే దాకా గణపతు లందరిలోకీ పెద్దవాణ్ణి కైలాసాన్నీ, పార్వతినీ సంరక్షించటానికి ఏర్పాటు చేసి, విష్ణువు రుద్ర, వీరభద్ర గణాలతో బ్రహ్మ వద్దకు వెళ్ళాడు. దేవేంద్రుడు మొదలైనవారు కూడా వచ్చి విష్ణువు తలపెట్టిన పని గురించి విన్నారు.

తరవాత అందరూ మారు రూపాలు ధరించి రుద్రగణాలతో సహా శోణితపురం వెళ్ళారు. నంది గంగిరెద్దుగా మారాడు. మిగిలిన వాళ్ళంతా వివిధ వాద్యాలు వాయించేవాళ్ళ వేషాలు ధరించారు. విష్ణువు ఎద్దును ఆడించేవాడుగా మారాడు. వాళ్ళందరూ శోణితపురం వీథులలో తిరుగుతూ, గంగిరెద్దును ఆడిస్తూ, శివ స్తోత్రాలు చేస్తూ వచ్చారు.

గంగిరెద్దు అద్భుతంగా మనుషులు చెప్పినట్టు చేస్తున్నదని విని, గంగిరెద్దుల వాళ్ళను గజాసురుడు తన సభకు పిలిపించాడు. గంగిరెద్దు పాటకు తగినట్టుగా నృత్యం చేసింది. వాళ్ళు పాడే పాటలన్నీ శివస్తోత్రాలు. ఆ స్తోత్రాలకు పొంగి, గజాసురుడి గుండెలో ఉన్న శివలింగం పెరగసాగింది.

**9.** గజాసురుడి మరణం



ఇదంతా తెలిసి గజాసురుడి పరివారం యుద్ధానికి వచ్చారు. ఆ రాక్షసుల నందరినీ విష్ణువు చంపేశాడు.

తరవాత బ్రహ్మ, విష్ణు, దేవేంద్రుడూ, నందీశ్వరుడూ, మొదలైనవారు తమ ఎప్పటి రూపాలు దాల్చి శివుడికి నమస్కారం చేశారు. వారంతా రుద్రగణాలను వెంటబెట్టుకుని కైలాసానికి వచ్చారు. శివుడు, తాను గజాసురుణ్ణి చంపి తిరిగి వచ్చినట్టు పార్వతికి కబురు పంపాడు.

అప్పటికే ఈ వార్త తెలిసి సంతోషించిన పార్వతి, తలంటి పోసుకుని గృహదేవతలను పూజించే ఉద్దేశంతో, సింహద్వారంలో ఉన్న లక్ష్మిగణాధిపతులతో, "నాయనలారా, నేను తలంటుకోబోతున్నాను. నేను చెప్పేదాకా ఎవరినీ లోపలికి రానివ్వకండి," అని చెప్పింది.

లింగం పెరిగిపోతున్నకొద్దీ గజాసురుడికి ఊపిరి సలపలేదు. అతను తనకు చావు మూడిందని గ్రహించి, "పరమేశ్వరా, రక్షించు!" అన్నాడు.

"గజా, నీకు చావు తప్పదు. వరం కోరు," అన్నాడు శివుడు.

"నా తల పూజనీయంగా ఉండాలి. నా చర్మం నువు ధరించాలి. నాకు జన్మరాహిత్యం కావాలి. ఈ వరాలు ప్రసాదించు," అన్నాడు గజాసురుడు.

శివుడు అతనికి కోరిన వరాలిచ్చి, అతను ఎలుకరూపంలో తన వద్ద ఉండేటట్టు అనుగ్రహించి, గజాసురుడి పొట్ట చీల్చుకుని బయటికి వచ్చాడు.

మరి కొంతసేపటికి నందీశ్వరుడు మొదలైనవారు వచ్చి, లోపలికి ప్రవేశించబోయారు. అప్పుడు లక్ష్మి గణపతులు వారికి అడ్డు తగిలి, "అమ్మ తలంటుకుంటున్నది. లోపలికి ఎవరినీ రానీయవద్దన్నది. అందుచేత ఆమె చెప్పేదాకా మీరు లోపలికి పోరాదు," అన్నారు.

"మాకు ఈశ్వరాజ్ఞ ఉన్నది. మూడు లోకాలలోనూ ఈశ్వరాజ్ఞకు ఎదురు లేదు. మధ్య మీరెవరు?" అంటూ రుద్రగణాల



వాళ్ళు లక్ష్మిగణాల వాళ్ళతో కయ్యానికి దిగారు. కోలాహలం జరిగింది.

ఈ కోలాహలం విని పార్వతి పరిచారిక ఒకతె వచ్చి చూసి, పార్వతి వద్దకు వెళ్ళి, ''లక్ష్మిగణాలవాళ్ళూ, రుద్రగణాల వాళ్ళూ కొట్టుకుంటున్నారు,'' అన్నది.

రుద్రగణాలవాళ్ళ ప్రవర్తనకు కోప గించి పార్వతి లక్ష్మిగణాలవాళ్ళకు సహా యంగా దేవగణాలవాళ్ళను పంపింది. లక్ష్మిగణాలూ, దేవగణాలూ ఏకమై రుద్ర గణాలవాళ్ళను చావగొట్టి తరిమేశాయి.

లక్ష్మిగణాలవాళ్ళ చేతుల్లో ఓడి పారి పోయిన రుద్రగణాలవాళ్ళు, శివుడి దగ్గి రకు వచ్చారు. అక్కడ ఉన్న నారదుడు, ''పార్వతి ద్వారపాలకులకు ఇంత పొగరా? శివుడి అజ్ఞనే ధిక్కరిస్తారా?'' అన్నాడు.

తన భృత్యులు దెబ్బలు తిన్నందుకే మండిపోతున్న శివుణ్ణి నారదుడి మాటలు మరింత రెచ్చగొట్టాయి. ఆయన తన త్రిశూలాన్ని పంపి లక్ష్మిగణాల వాళ్ళ తలలు నరికించేశాడు. తన ముద్దుల కొడుకుల తలలు తెగిపోయినందుకు పార్వతి విచారంలో మునిగిపోయింది.

పార్వతీదేవి ద్వారంవద్ద ఇప్పుడెవరూ అడ్డేవారు లేరు. అందుచేత శివుడు బ్రహ్మ విష్ణులను వెంటబెట్టుకుని పార్వతి ఇంటికి వచ్చాడు. అప్పటికే తలంటి పోసుకుని, శృంగారించుకుని, గృహదేవతలను పూజించిన పార్వతి, లక్ష్మిగణాల చావుకు విచారంలో మునిగి ఉండటంచేత వచ్చిన వారిని గౌరవించలేదు.

శివుడు పార్వతి విచారాన్ని పోగొట్టుదా మని పార్వతిని సమీపించాడు. కాని పార్వతి శివుడికేసి చూడనన్నా లేదు.

అప్పుడు విష్ణువు పార్వతిని సమీపించి, ''చెల్లీ, గజాసురుడు చచ్చినందుకు మూడు లోకాలూ ఆనందంలో మునిగి ఉండగా నువు విచారంలో మునిగి ఉండ టానికి కారణమేమిటి? నీకు వచ్చిన కష్టమేమిటో చెప్పు, నేను తీర్చుతాను,'' అన్నాడు.



పార్వతి విష్ణువుతో, "అన్నా, శివుడు నిష్కారణంగా నా కొడుకులైన లక్ష్మి గణాల వారిని చంపాడు. వాళ్ళను బతికించి, వాళ్ళకు తగిన అధికారాలను ఇస్తేగాని నా విచారం తీరదు," అన్నది.

త్రిమూర్తులతో శివుడు, గజాసురుడికి తాను ఇచ్చిన వరాల మాట చెప్పాడు. తన తల పూజనీయంగా ఉండాలనీ, తన చర్మాన్ని శివుడు ధరించాలనీ గజాసురుడు శివుణ్ణి కోరి ఉన్నాడు.

అందుచేత లక్ష్మిగణాలకు అధిపతి అయిన వాడి శరీరాన్ని సభకు తెప్పించి, రుద్రగణాలను పంపి గజాసురుడి తల తెప్పించి, దాన్ని లక్ష్మిగణాధిపతి శరీరానికి అతికించారు. వెంటనే లక్ష్మిగణాధిపతి నిద్రలేచిన వాడిలాగా లేచి నిలబడి పార్వతికీ, విష్ణువుకూ నమస్కారం చేశాడు. అదే విధంగా మిగిలిన ఇరవై మంది గణాధిపతుల మొండాలకూ ఏనుగు తలలు తగిలించారు. వెంటనే వారు కూడా బతికారు. లక్ష్మిగణాల వాళ్ళు ఈ విధంగా సజీవులు కాగానే పార్వతీదేవి పరమానందం చెందింది.

ఆ అనంద సమయంలో విశ్వదర్శి అనే ఉపబ్రహ్మ సభలో లేచి నిలబడి, "శివపార్వతులారా, నా కుమార్తెలైన జయలక్ష్మి మొదలైన వాళ్ళను లక్ష్మి గణాధిపతులకు ఇచ్చి పెళ్ళి చేదామనుకుంటున్నాను," అన్నాడు.

ఈ మాటకు అందరూ సంతోషించారు. బ్రహ్మ తానే పురోహితుడుగా ఉండి, విశ్వదర్శి కూతుళ్ళను గణాధిపతులకు పెళ్ళి చేశాడు. గణాధిపతులలో లక్ష్మి గణపతి పెద్దవాడు. అతని భార్య జయలక్ష్మి.

ఇరవైఒక్క మంది గణాధిపతులకూ, విశ్వదర్శి అనే ఉపబ్రహ్మ కుమార్తెలకూ పెళ్ళి జరిగిపోగానే పార్వతి శివుడితో, "పరమేశ్వరా, నా కొడుకులకు అధికారాలిచ్చి, గజాసురుడికి ఇచ్చిన వరం సార్థకం చెయ్యండి," అన్నది.

శివుడు ఆమె కోరిక తీర్చే ఆలోచనలో ఉండగా అక్కడికి కుమారస్వామి వచ్చి, పార్వతీ పరమేశ్వరులతో, తనకు కూడా గణాధిపత్యం ఇప్పించవలసినదని కోరాడు.

"నీకు దేవగణాల మీద అధిపత్యం ఇచ్చి ఉన్నాం గదా, రుద్రగణాల మీద అధికారాన్ని లక్ష్మిగణాధిపతులకు ఇద్దాం. అందుకు ఒప్పుకో," అన్నాడు శివుడు.

అందుకు కుమారస్వామి ఒప్పుకోక, తనకు కూడా గణాధిపత్యం కావాలని మొండిగా పట్టుబట్టాడు.

అప్పుడు శివుడు కుమారస్వామికీ, లక్ష్మిగణాధిపతులలో పెద్దవాడికీ ఒక పోటీ కల్పించాడు. ఆ ఇద్దరూ తమ తమ వాహనాల మీద వెళ్ళి, పుణ్యక్షేత్రాలు చూస్తూ, పుణ్యతీర్థాలలో స్నానాలు చేస్తూ, భూప్రదక్షిణం చేసి కైలాసానికి తిరిగి రావాలి. ఎవరు ముందుగా తిరిగివస్తే వారిది సర్వగణాధిపత్యం. ఇందుకు వాళ్ళు సమ్మతించారు.

శివుడు కుమారస్వామికి వాహనంగా నెమలిని ఇచ్చి, ఎలుక రూపంలో తన వద్ద ఉన్న గజాసురుణ్ణి లక్ష్మిగణాధిపతికి వాహనంగా ఇచ్చాడు. కుమారస్వామి పట్టరాని సంతోషంతో నెమలిని ఎక్కి మరుక్షణమే రివ్వున ఆకాశంలోకి ఎగిరి పోయాడు.

లక్ష్మిగణాధిపతి పార్వతివద్దకు వెళ్ళి, "అమ్మా, చూడు నాకు ఎంత అన్యాయం జరిగిందో! కుమారస్వామి బలవంతుడూ, అజానుబాహువూనూ. అతనికి నెమలిని వాహనంగా ఇచ్చారు. మేమంతా పొట్టి వాళ్ళము. నేను తల బరువూ, పొట్ట బరువూ పెట్టుకుని, ఎలుక మీద ఎలా ప్రయాణం చెయ్యగలను? ఇలాటి పరీక్ష పెట్టేకన్న మాకు అధికారం ఇచ్చేది లేదని చెబితే సరిపోయేది గదా!" అన్నాడు.

"నాయనా, మీ మామ అయిన విష్ణువును ఏదన్నా ఉపాయం అడుగు," అని పార్వతి లక్ష్మిగణాధిపతితో అన్నది.





# యాచకుడి చలి

ఒకానొకప్పుడు శ్వేతనగరాన్ని చలి పురుషుడు ఆవహించాడు. నగరంలో ఎన్నడూ ఎరుగని చలి. చీకటిపడేసరికి చలి మరింత పెరిగిపోయేది. ప్రజలు చలికి భయపడి తలుపులు మూసుకుని, ఇళ్ళు కదిలేవాళ్ళు కాదు.

అలాంటి సమయంలో, జితేంద్రు డనే ఒక భాగ్యవంతుడి ఇంట్లో, ఒక చిక్కు సమస్య తలఎత్తింది. జితేంద్రుడి తండ్రి భోగేంద్రుడిది అరవై సంవత్సరాల వయసు. ఉన్నిశాలువలు కప్పినప్పటికీ, ఆయన చలికి తట్టుకోలేక పోతున్నాడు. ఆయన కోసం చలిమంటలు వేశారు. అయినా, ఆయనకు చలి తగ్గడం లేదు.

''ఇది మామూలు చలి కాదు; చలి జ్వరం. వైద్యుణ్ణి పిలిచి ఏదైనా మంది ప్పిస్తేతప్ప, యిది తగ్గదు,'' అన్నది జితేంద్రుడి తల్లి.

అయితే, అంత చలిలో వైద్యుడింటికి ఎవరు వెళతారు ? వెళితేమాత్రం వైద్యుడు తమ ఇంటికి వచ్చి, రోగనిదానం చేసి మందిస్తాడా ?

''వైద్యుడెలాగూ ఈ చలిలో ఇల్లు కదిలిరాడు. ఎవరైనా అతని దగ్గరికిపోయి ఈయన లక్షణాలు చెబితే విని, తోచిన మందేదైనా యిస్తాడు,'' అన్నది జితేంద్రుడి తల్లి సలహాధోరణిలో.

అయితే, ఇల్లు వదిలి బయటకు వెళ్ళ డానికి ఎవరూ సిద్ధం కాలేదు. ఇంట్లో యిద్దరు పనివాళ్ళున్నారు. వాళ్ళు కూడా తమవల్ల కాదనేశారు. ఆఖరుకు జితేంద్రుడు కలగజేసుకుని, పనివాళ్ళను గట్టిగా కోప్పడి, వాళ్ళల్లో ఒకణ్ణి వైద్యుడి ఇంటికి వెళ్ళమన్నాడు. చేసేదిలేక విసుక్కుంటూ, ఆ పనివాడు వీధి తలు పులు తీశాడు.

"వసుంధర"



ఆయన మహిమ ఎంత గొప్పదంటే— ఇంత చలిలోనూ ఆయన రవంత కూడా వణకడం లేదు,'' అని చెప్పాడు.

ఈ విడ్డూరం విని జితేంద్రుడు తనూ వీధి గుమ్మం వద్దకు వెళ్లాడు. యాచకుడు వట్టిచేతులతో వచ్చిన జితేంద్రుణ్ణి చూసి, నిరుత్సాహంగా, ''అయ్యా, ఆకలిబాధ భరించలేకుండా వున్నాను. పిడికెడు మెతుకులు పెట్టించండి,'' అన్నాడు.

జితేంద్రుడు వాడికేసి పరీక్షగా చూస్తూ, ''నా తండ్రి భరించరాని చలిజ్వరంతో బాధపడుతున్నాడు. ఆయన బాధ తగ్గించావంటే, పిడికెడు మెతుకులేం కర్మ, నీకు కడుపునిండా తృప్తిగా భోజనం పెట్టగలను,'' అన్నాడు.

అందుకు యాచకుడు దీనంగా, ''అయ్యా, తిండికోసం అటువంటి షరతులు పెట్టకండి. నాకు వైద్యం రాదు. మామూలు బిచ్చగాణ్ణి,'' అన్నాడు.

జితేంద్రుడు ఒకక్షణం ఆలోచించి, ''పోనీ, పక్కవీధిలో వున్న వైద్యుడింటికి వెళ్ళి మందు తెచ్చి పెట్టగలవా?'' అని అడిగాడు యాచకుణ్ణి.

''నా కిప్పుడు ఒంట్లో బొత్తిగా ఓపిక లేదు. కాసినిమెతుకులు తింటే తప్ప కదలలేను,'' అంటూ యాచకుడు ఉన్న చోటునే కూలబడ్డాడు.

తలుపులు అలా తెరుచుకోగానే, ''అమ్మా, ఒక్క ముద్ద పెట్టించరడమ్మా!'' అన్న కేక పనివాడికి వినిపించింది.

ఎదురుగా గజగజ వణికించే చలిలో, ఒక యాచకుడు నిలబడివున్నాడు. వాడు చిన్న అంగవస్త్రం కట్టుకుని వున్నాడు. అది తప్ప, వాడి శరీరం మీద మరే ఆచ్ఛాదనాలేదు. చేతిలో మట్టిచిప్ప ఒకటి వున్నది. విశేషమేమంటే—అంత చలిలోనూ వాడేమాత్రం వణకడం లేదు.

ఇది చూసి పనివాడు లోపలికి వెళ్ళి, జితేంద్రుడితో, ''అయ్యా, మనకిక వైద్యుడి అవసరం లేదు. ఒక మహాయోగి మన ఇంటి గుమ్మం ముందేనిలబడి వున్నాడు!



''ఆలోచించుకో! మందు తెస్తేనే, నీకు అన్నం పెడతాను. అలా కాకపోతే మరో కర్ర పంపిస్తాను,'' అన్నాడు జితేంద్రుడు.

ముందుగా తిండి పెడితే, వాడు తినేసి పని చేయనని మొండికేస్తాడని జితేంద్రుడికి అనుమానం కలిగింది.

విధిలేక యాచకుడు వైద్యుడి దగ్గిరకు వెళ్ళేందుకు ఒప్పుకున్నాడు. అప్పుడు జితేంద్రుడు, తండ్రి వ్యాధిలక్షణాలన్నీ ఒక కాగితం మీద రాసి యాచకుడికిచ్చి, ''దీని మీద వైద్యుడి సమాధానం కూడా రాయించుకురా!'' అని వాడికి, వైద్యుడింటికి దారి చెప్పాడు.

వైద్యుడి సమాధానం కాగితం మీద రాయించుకుని రాకపోతే, వాడు దారిలోని ఏ మట్టినో ఉండలు చేసి తెచ్చి, అదే మందు అనే ప్రమాదమున్నదని, జితేంద్రుడికి తెలుసు.

యాచకుడు లేని ఓపిక తెచ్చుకుని అక్కడి నుంచి బయలుదేరాడు. వాడు తప్పక మందు తెస్తాడని జితేంద్రుడికి నమ్మకం కుదిరి, లోపలకు వెళ్ళి మిగతా వాళ్ళతో జరిగింది చెప్పాడు. అప్పుడు అందరూ యాచకుడు చలికి వణకక పోవడం గురించి వింతగా చెప్పుకున్నారు.

''కొంతమంది బిచ్చగాళ్ళకు, చలి బాధను తప్పించే మూలికలు తెలుస్తాయి. అవి నమిలి ఎంత చలిలోనైనా, వాళ్ళు మామూలుగా తిరగ్గలుగుతారు. మందు తెచ్చాక, వాడినడిగి, ఆ మూలికలేవో తప్పక తెలుసుకోవాలి,'' అన్నది జితేంద్రుడి తల్లి.

''మూలికల సంగతి ఎలాగున్నా, ఈ చలికాలంలో మనకు యిలాంటి పని వాడుండడం చాలా అవసరం. వీడికైతే ఎక్కువ జీతం కూడా యివ్వనవసరం లేదు. రోజూ రెండు పూటలా తిండి పెడితే, ఎంత పనైనా చేస్తాడు,'' అన్నాడు జితేంద్రుడు.

కొద్దిసేపు తరవాత యాచకుడు తిరిగి వచ్చాడు. వాడు తెచ్చిన మందు క్షణాల

మీద భోగేంద్రుడికి పని చేసింది. ఆయన సుఖంగా నిద్రపోయాడు.

ఈలోగా జితేంద్రుడి భార్య, యాచకుడికి కడుపునిండా భోజనం పెట్టింది. భోజనం అయ్యాక ఆమె, వాణ్ణి, "నీకు పాలు పితకడం వచ్చా?" అని అడిగింది.

"వచ్చు, తల్లీ!" అన్నాడు వాడు.

జితేంద్రుడికి రెండు పాడి ఆవులూ, రెండు పాడి గేదెలూ వున్నవి. చలి తీవ్రత కారణంగా ఇంట్లో పనివాళ్ళు, రాత్రిళ్ళు పశువుల పాకలోకి వెళ్ళి పాలు తీయడం మానేశారు.

జితేంద్రుడి భార్య, యాచకుడికి పాల చెంబూ, పెద్ద బిందే యిచ్చి, "అయితే, పాలు తీసి పట్టుకురా!" అన్నది.

యాచకుడు వెంటనే చెంబూ, బిందే తీసుకుని పశువులపాకలోకి వెళ్ళి, పాలు పితికి తీసుకువచ్చాడు. ఇందుకు జితేంద్రుడి భార్య ఎంతగానో సంతోషించింది. ఇంటిల్లపాదీ తమకు చలిబెడద తీరిపోయిందనే అనుకున్నారు. ఎందుకంటే, అంత చలిలోనూ బయట కావలసిన ఏ పనైనా, యాచకుడు చేసిపెడుతున్నాడు.

యాచకుడికి నడవాలో ఒక చాప వేసి పడుకోమని చెప్పారు. వాడు పడుకోబోతూ, "కప్పుకునేందుకేమైనా వుంటే, ఇవ్వండమ్మా!" అన్నాడు.

"దొడ్లో ఆరవేసిన కంబళి వున్నది. వెళ్ళి తెచ్చుకో," అన్నది జితేంద్రుడి తల్లి.



వాడు నడవాలోంచి బయిటికి వెళ్ళ బోతూండగా, రివ్వుమంటూ చలిగాలి తగిలింది. వాడు కంగారుగా వెనక్కు తిరిగి, ''అమ్మా, బయట చలిగా వున్నది. ఇంట్లో వేరే కంబళ్ళు లేవా ?'' అని అడిగాడు.

యాచకుడి మాటలు విని అందరూ తెల్లబోయారు. జితేంద్రుడు ఆశ్చర్యంగా వాణ్ణి, ''నీకు చలి వేస్తుందా ?'' అని అడిగాడు.

''అదేమిటి, బాబూ! మనిషన్నవాడికి చలి తెలియకుండా వుంటుందా ?'' అన్నాడు యాచకుడు.

''అయితే, మరి వైద్యుడి వద్దకు వెళ్ళినప్పుడూ, పాలు తేసేందుకు పోయినప్పుడూ, నీకు చలి తెలియలేదా ?'' అన్నాడు జితేంద్రుడు.

''ఏమో, బాబూ! రెండు రోజులుగా నాకు బొత్తిగా తిండి దొరకలేదు. ఆకలి బాధ తప్ప మరొకటి, నాకు తెలియదు. బయట చలిగా వున్నదో లేదో కూడా, నేను గుర్తించలేదు. ముందు నా ఆకలి తీరాలి. ఆకలి తీరాలంటే, వెళ్ళి అడుక్కోవాలి. చలి, చలి అని కూర్చుంటే కడుపు నిండదుకదా!'' అన్నాడు యాచకుడు.

''అయితే, మరి పాలెలా తీయగలిగావు ?'' అన్నాడు జితేంద్రుడు.

''అందులో ఆశ్చర్యమేముంది, బాబూ! అమ్మగారు నాకు కడుపునిండా తిండి పెట్టి, నా ఆకలి తీర్చారు. ఆ అమ్మ ఏమి



చెప్పినా చేయాలనే ఉద్దేశం, నాలో కలిగింది. పాలు తీస్తున్నప్పుడు, నాలో కృతజ్ఞతతప్ప వేరొకటి లేదు. అందువల్ల, చలి గురించి, నాకు తెలియలేదు,'' అన్నాడు యాచకుడు.

ఆ జవాబుతో జితేంద్రుడికి ఒక ముఖ్య విషయం అర్థమైంది. యాచకుడికి అన్నిటి కన్న ముందు ఆకలి తీరడం అవసరం. ఆ అవసరంలో వాడికి చలిబాధ తెలియలేదు. అన్నం తిన్నాక కృతజ్ఞతాభావంతో చలి తెలియలేదు. తనకోసం కంబళి తెచ్చుకోవాలనుకున్నప్పుడే, వాడు చలి దెబ్బకు గురయాడు. అంటే—వాడు చాలా ఉత్తముడు. అన్నం పెట్టినవారి పట్ల కృతజ్ఞతాభావం వున్నవాడు. కాని, ఆ సమయంలో జితేంద్రుడికి ఒక చిన్న సందేహం కలిగింది.

ఆయన, యాచకుడితో, ''ఎంత ఆకలి వున్నా, ఎంత కృతజ్ఞత వున్నా శరీరానికి ఉష్ణం, చలీలాంటివాటిని తట్టుకునేందుకు కొన్ని పరిమితులుంటాయి. రక్తాన్ని గడ్డకట్టించే. యింత భయంకరమైన చలిని, నువ్వెలా తట్టుకుని నిలబడగలిగావో, నా కాశ్చర్యంగా వున్నది,'' అన్నాడు.

ఆ ప్రశ్నకు యాచకుడు చిన్నగా నవ్వి, ''దానిదేముంది, బాబూ! సదుపాయాలున్నవారి సాగుబడి కానీ, ఈ చలి మరీ అంత ఓర్చుకోలేనిదేం కాదు. ఏ దారీ లేనివాడే, యీ చలిలో పని చేయడానికి సిద్ధపడతాడు. ఏ సదుపాయాలూ ఎరగని కారణంగా, అవసరమైనప్పుడీ చలికి తట్టుకోగల మానసికశక్తి, నాకున్నది,'' అన్నాడు.

జితేంద్రుడికి అన్ని సందేహాలూ తీరిపోయాయి. ఆనాటి నుంచీ ఆయనా, మిగతావాళ్ళూ కూడా చలికి మరీ భయపడడం మానేశారు. పనివాళ్ళు కూడా జితేంద్రుడు బాగా కోప్పడడంతోభయపడి, అన్ని పనులూ చేయసాగారు. ఆయన యాచకుణ్ణి కూడా తన పనివాళ్ళలో ఒకడుగా చేర్చుకున్నాడు.



# రాబందులు

కొండ మీది నుంచి దుర్భిణితో మనం కింది లోయలలోని చెట్లూ చేమలను స్పష్టంగా చూసినట్టు, దుర్భిణి (బైనాక్యులర్స్) లేకుండానే ఎంత ఎత్తునుంచయినా నేల మీదికి చూడగలిగిన శక్తిగల పక్షులు రాబందులు. వీటికళ్ళు సహజంగానే దుర్భిణి లాగా పని చేస్తాయి. మనుషులకు గాని, మరి ఏ ఇతర పక్షికి గాని ఇటువంటి శక్తిలేదు. రాబందుల కళ్ళల్లో దగ్గర ఉన్నవాటిని చూడడానికి ఒక భాగమూ, దూరంగా ఉన్నవాటిని చూడడానికి మరొక కేంద్రీకృతభాగమూ పని చేస్తాయి. ఆహార అన్వేషణకు ఈ శక్తి ఎంతగానో ఉపయోగపడుతుంది.

డేగల్లా మాంసాహారులైన రాబందులు ఆకారంలో చాలా పెద్దవి. ఒక మీటరు వరకు పొడవు కలిగి ఉంటాయి. బలమైన రెక్కలతో సునాయాసంగా ఆకాశంలోకి ఎగిరిపోతాయి. వీటి తల మీదా, కంఠం మీదా ఈకలు ఉండవు. బలమైన కాళ్ళలో చివర మూడు వేళ్ళు ముందుకూ ఒక వేలు వెనక్కూ వంగి ఉంటాయి. ముక్కులు దృఢంగానూ, ముందుకు వంగీ ఉంటాయి.

రాబందులు మాంసాహారులే అయినప్పటికీ ఇవి, జంతువులను, పక్షులను సాధారణంగా చంపి తినవు. కాని చచ్చినవాటిని పీక్కు తింటాయి.

ఆసియా, ఆఫ్రికా ఖండాలలోనూ, ఐరోపా ఖండంలోని వెచ్చని ప్రాంతాలలోనూ, ఏదైనా అడవి జంతువు చనిపోయినట్లయితే, అక్కడ రాబందులు గుంపులు గుంపులుగా వాలి ఆ జంతువు ఎముకల మీది మాంసాన్నంతా ఆనందంగా పీక్కు తింటాయి. ఆహారం లభించనప్పుడు పస్తులుండడానికి అలవాటుపడిన ఈ పక్షులు తిండి దొరికినప్పుడు కావలసిన దానికన్నా ఎక్కువగానే తింటాయి! రాబందులు జంతు ప్రేతాలను పీక్కు తినడం వాతావరణ కాలుష్యాన్ని అరికడుతుంది.

రాబందులలో చాలా రకాలు ఉన్నప్పటికీ మన దేశంలో నల్లరాబందులే ఎక్కువగా కనిపిస్తాయి.





# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. C. Morabad



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఊదకు వినలేను బాకా

రెండవ ఫోటో: ఊదితే ఎగిరేను బాగా

పంపినవారు: రామతీర్థ, పరదీప్ (P. O.) కటక్ జిల్లా, (ఒరిస్సా)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

## మీకు తెలుసా? సమాధానాలు

1. ది బెంగాల్ గెజెట్ (1780) 2. అక్రాప్ 3. ఆల్ప్స్ శిఖరం 4. ఋశివదరం
5. పతంజలి.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

రోజులో రెండు మధురానుభూతులు మీరు మెచ్చుకొనేలా అందిస్తోంది...




ట్రస్ట్

## ఉదయం రివ్వురివ్వున తాజాదనపు అహ్లాదం కలిగించి, రాత్రి అంతా సూక్ష్మక్రిమికారకమైన దంతక్షయం బారినుంచి రక్షణ కల్పించే ఒకేఒక్క దంతరక్షణ ప్యాకేజి.

మీరు ఆదమరచి నిద్రలో వున్నప్పుడు చిన్నచిన్న ఆహారపు అణువులు పళ్లలో చిక్కుకుని వుండి సూక్ష్మక్రిముల్ని సృష్టిస్తాయి. అవి అతి వేగంగా రెట్టింపై నోరంతా వ్యాపించి గార పట్టిస్తాయి.గార మూలంగా హానికరమైన ఆమ్లాలు ఉత్పత్తయి దంతక్షయానికి, పుప్పిపళ్లకు ప్రధానకారణాలవుతాయి.

ప్రతి రాత్రి నిద్రకుపక్రమించేముందు ట్రస్ట్ (నైట్) తో మీ పళ్లను బ్రష్ చేసుకోవడం అలవరచుకోండి. నిద్రపోతున్నప్పుడు దంత సమస్యలు ఉత్పన్నంకావు. ఒక్క ట్రస్ట్ (నైట్) లో మాత్రమే క్లోరెక్సిడిన్ అనే ప్రత్యేక రసాయనం వుంది. మీరు నిద్రిస్తున్న సమయంలో అనేక గంటలపాటు పళ్లపై గార పట్టకుండా నివారిస్తుంది.

ఉదయాన్నే మళ్లీ ట్రస్ట్ (మార్నింగ్) తో మీ దినచర్యను ఆరంభించండి. ట్రస్ట్ లో చురుకైన అంతర్గత ద్రవ్యాలు మీ పళ్లను పూర్తిగా శుభ్రపరచి,తళతళ లాడిస్తాయి. ట్రస్ట్ లోని అద్భుతమైన సువాసన,దుర్గంధాన్ని నివారించి మీశ్వాసను చల్లగా,తాజాగా వుంచుతుంది.ట్రస్ట్ నమ్మికకు మరోపేరు.ట్రస్ట్ ను అలవాటు చేసుకోండి.మీ దినచర్యను ప్రారంభించేందుకు ట్రస్ట్ ఒక్కటే ఉత్తమ మార్గం.




ట్రస్ట్... మీకు అవసరం, రాత్రి -ఉదయం.

# NEW!

# POWER PACKED SURF




కొత్త పవర్ ప్యాక్డ్ సర్ఫ్.

మునపటికన్న మరింత శక్తి పెల్లుబికే సూత్రీకరణతో....లోతుకు చొచ్చుకుపోయి శుభ్రంగా ఉతికేందుకు, మీ తెల్ల బట్టలను అతి తెల్లగా, రంగు బట్టలను అతి ప్రకాశవంతంగా ఉంచేందుకు.

అయినా బట్టలను మరింతకాలం కొత్త వాటిలా రక్షణ-నిస్తుంది. ప్రతి షర్టునూ, ప్రతి బట్టనూ తాజాగా, శుభ్రంగా, తెల్లగా కొత్త దానిలా ఉంచుతుంది.

ఉతుకు ఉతుక్కి..

కొత్త, తాజా పరిమళం: మీ బట్టలపై ఇది నిలిచి వుంటుంది. ఎంతో, శుభ్రంగా, తాజాగా హాయిగా దగ్గరకు చేర్చేలా.

సొగసైన కొత్త ప్యాక్! లోపల వున్న కొత్త పవర్ ప్యాక్డ్ పౌడర్‌కు దీటైనది.

రండి. ఈ రోజే కొత్త పవర్ ప్యాక్డ్ సర్ఫ్ కొనండి.

## సర్ఫ్ ఉతుకుతుంది ఎంతో తెల్లగా...ఉంచుతుంది మీ బట్టలను సరికొత్తగా!

LINTAS SU 325 2117 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి